# THE ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES

[*Part II—Proceedings other than Questions and Answers*]

*OFFICIAL REPORT*

---

Twenty-sixth day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Thursday, the 20th February,* 1958

The House met at Two of the Clock

[*Mr Speaker in the Chair*]

### Questions and Answers.

(See Part I)

### Adjournment motion re Strike by the Etikoppaka Sugar Workers' Union

మిస్టర్ స్పీకర్ —రత్నసభాపతిగారు ఒక అడ్జర్న్‌మెంట్ మోషన్ యిచ్చినారు

It is "To discuss a definite matter of public importance, namely, the strike by the Etikoppaka Sugar Workers' Union, involving 600 workers from 8-2-1958 onwards consequent on the refusal of the management and the Government to redress their legitimate grievances."

ఏటికొప్పాక పంచదార మిల్లు కార్మికుల అసంతృప్తిని గురించి, సమ్మె పెండలయిన వాటిని గురించి చెప్పారు కొంతమందిని అరెస్టుకూడ చేశారన్నారు ఆ విషయాలమీద ఒక గంట డిస్కషన్‌కు టైము యిస్తే బాగుంటుందని సుందరయ్యగారు కోరుతున్నారు

కార్మికశాఖా మంత్రి (శ్రీ డి సంజీవయ్య) —8 వ ఫిబ్రవరిన సమ్మె ప్రారంభంచేశారు 7 వ తేదీన ఒక ఇష్యూను గురించి ట్రిబ్యూనల్‌కు పంపామని వారికి తెలియజేశాము ట్రిబ్యూనల్

ముందు ఒక ఇష్యూ ఉండగా సమ్మె చేయుట ఇల్లీగల్ అవుతుంది ఇల్లీగల్‌గా చేస్తున్న సమ్మెను గురించి చర్చించుటకు ఒక గంట అల్లాట్ చేసుకొనుట మంచిది కాదని అనుకొంటాను

శ్రీ పి సుందరయ్య (గన్నవరం) —అధ్యక్షా! ఆ విషయం ఇల్లీగల్ కాదు కార్మికులు ఏమి అడిగినారు, ప్రభుత్వపైఖరి ఏమిటి అనేది చర్చించుటకు యిది తీసుకువచ్చాము పంచదార మిల్లుల విషయంలో ఇది ఒకటే కాదు చాలా వస్తున్నవి ఆ విషయాల గురించి కనీసం ఒక గంట సేపైనా చర్చించటం అవసరమని నేను మనవి చేస్తున్నాను

శ్రీ డి సంజీవయ్య —ఇండస్ట్రియల్ ట్రిబ్యునల్ అనేది ఒక కోర్టు అట్టి కోర్టు ముందు ఒక విషయం విచారణ జరుగుతున్నప్పుడు దానినిగురించి చర్చించుట సబ్జుడిస్ అవుతుందనేది ఒక పాయింట్

శ్రీ పి సుందరయ్య —అది చాలా అన్యాయం ప్రతిదీ సబ్జుడిస్ అని అసెంబ్లీ హక్కులు తోసివేస్తున్నారు ట్రిబ్యునల్ ముందు అనేక విషయాలు ఉంటవి అయినప్పటికీ పార్లమెంటులో చర్చలు జరుగుతున్నవి మంత్రిగారికి తెలిసే ఉంటుంది సబ్జుడిస్ అని చెప్పటం యిది మొదటి పర్యాయంగా వింటున్నాను ఎప్పుడూ వినలేదు

శ్రీ బి రత్నసభాపతి (బద్వేల్) —కార్మికులు అడిగిన డిమాండ్సు అయిదారున్నవి ఒక డిమాండులో ఒక భాగములోనిది కొంత ట్రిబ్యునల్‌కు రిఫర్ చేశారు అది యడ్జుడికేషన్ అనే అర్థం యివ్వదు వారి డిమాండ్సు ఏమిటో తెలుసుకొనకుండా, డిస్కస్ చేయకుండా నిరాకరించాలనడం న్యాయంకాదు కాబట్టి డిస్కషన్ కి అనుమతించాలని కోరుతున్నాను

శ్రీ బి శ్రీరామమూర్తి (విజయనగరం) —పాయింట్ ఆఫ్ ఆర్డర్, సర్, ఏటికొప్పాకలో ఉన్న షుగర్ ఫ్యాక్టరీ **Public utility service** క్రింద పరిగణించవలసిన పరిస్థితి ఉన్నది అక్కడ జరుగుతున్న సమ్మెను ఇల్లీగలైజ్ చేస్తూ ప్రభుత్వం ప్రకటించటానికి అవకాశంలేదు ఇండస్ట్రియల్ డిస్ప్యూట్స్ యాక్టులో సెక్షన్ 10 (1) ప్రకారం, సెక్షన్ 22 ప్రకారం సమ్మె నోటీసు యిచ్చిన తరువాత ట్రిబ్యునల్‌కు తప్పనిసరిగా రిఫర్ చేయాలని ఉన్నది ఇప్పుడు ఆ రకంగా ప్రభుత్వం చేయని కారణంగా చట్టాన్ని ధిక్కరించింది ప్రభుత్వమే గాని అక్కడ ఉన్న కార్మిక సంఘంకాదని మనవిచేస్తూ దీనిమీద చర్చజరుపుటకు మీరు టైము యివ్వాలని కోరుతున్నాను

రెవిన్యూ మంత్రి (శ్రీ కె వెంకటరావు) —ఏటికొప్పాకలో ఉన్న షుగర్ ఫ్యాక్టరీని యిదివరకే అమ్మేశారు అక్కడ యింకొకటి ఉన్నట్లు ద్యోతకం కావటంలేదు

శ్రీ బి శ్రీరామమూర్తి —పేరు ఏటికొప్పాక షుగర్ ఫాక్టరీ అయినా అది దార్లపూడిలో ఉన్నది

శ్రీ కె విజయ భాస్కరరెడ్డి (ఎమ్మిగనూర్—జనరల్) —పాయింట్ ఆఫ్ ఆర్డర్, సర్, ఇది అడ్జర్న్‌మెంట్ మోషన్ క్రింద రూలు 71 ప్రకారం నోటీసు యిచ్చారు

The rules says " If the Speaker is satisfied, after calling for such information from the Member who has given notice and from the Minister, as he may consider necessary, that the matter is urgent and is of sufficient importance "

మెంబరు నోటీసు యిస్తే ఆ మెంబరు మాట్లాడాలిగాని యీ విధంగా జనరల్ డిస్కషన్ అనుమతించటానికి వీలుంటుందో లేదో రూలింగ్ యివ్వాలని కోరుతున్నాను

మిస్టర్ స్పీకర్ —దానిమీద ముగ్గురు,—సుందరయ్యగారు, రత్నసభాపతిగారు, వావిలాల గోపాలకృష్ణయ్యగారు, దస్కతు పెట్టారు అందువల్ల ముగ్గురికి నేను అవకాశం యివ్వవలసి వచ్చింది

శ్రీ కె విజయభాస్కర రెడ్డి —ఇతరులు కూడ మాట్లాడుతున్నారు

మిస్టర్ స్పీకర్ —దీనికి ఒక గంట టైము యివ్వవలెనా, లేదా అనే ప్రశ్న ఉన్నదీ ఒక గంట టైము యిస్తాను ఏరోజున యిస్తే వీలుగా ఉంటుంది

శ్రీ డి సంజీవయ్య —ఎజండా ప్రకారం బిజినెస్ ఉన్నది ?

*Mr Speaker* I shall post it to 22nd February 1958 for one hour discussion immediately after the question hour is over

ఆర్థిక మంత్రి (డాక్టర్ బి గోపాల రెడ్డి) --ఆ రోజున ఎజెండాలోని బిజినెస్ అంతా అయినతరువాత పెట్టుకుంటే బాగుంటుంది 7 గంటలనుంచి 8 గంటలవరకు కూర్చుంటే చల్లగా ఉంటుంది

శ్రీ డి సంజీవయ్య —ఆ రోజు బిజినెస్ అయిన తరువాత అని, మామూలుగా ఒక సంప్రదాయం ఉన్నది

శ్రీ పి సుందరయ్య —స్పీకరుగారు, 'క్వశ్చన్ అవర్' అయిన తరువాత అని చెప్పారు

మిస్టర్ స్పీకర్ —సరే నేను ఆవిధంగా చెప్పాను కనుక ఇక వెనుకకు పోయేదిలేదు

## Papers laid on the Table of the House

### *Amendments to the Andhra Pradesh General Sales Tax Rules 1957*

*Dr B Gopala Reddy* I beg to lay on the Table of the House, under sub section (4) of section 39 of the Andhra Pradesh General Sales Tax Act, 1957 a copy of the Amendments to the Andhra Pradesh General Sales Tax Rules 1957 published at pages 1-3 of Rules Supplement to Part I of the Andhra Pradesh Gazette dated the 2nd January, 1958

*Mr. Speaker* The Papers are laid on the Table of the House

## Draft amendment to the Andhra Pradesh Commercial Assessment Act 1957

*Sri K Venkata Rao* I beg to move

"That the draft amendments to the Schedule to the Andhra Pradesh Commercial Crops (Assessment) Act, 1957 (Andhra Pradesh Act XIX of 1957) which it is proposed to make in exercise of the powers conferred by sub section (1) of section 5 of the said Act, be approved The amendment hereby made shall come into force with effect from the Fasli year commencing on the first day of July 1958"

*Draft Amendment*

In the Schedule to the said Act, after entry 10, the following entries shall be added, namely

| *Crop* | | *Rate of Special Assessment* |
|---|---|---|
| "11 | Betel vine | Rs 5 per acre |
| 12. | Onions | Rs 5 per acre |

*Mr Speaker* Motion moved

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ) —అధ్యక్షా! పాయింట్ ఆఫ్ ఆర్డర్ సర్, మంత్రిగారు ప్రవేశపెట్టిన ప్రతిపాదనకు మన రూల్సు ప్రకారం పదిహేను రోజులలోపల అమెండ్‌మెంట్స్ ఇవ్వటానికి వీలున్నది వారి ప్రతిపాదన 15 రోజులు అయిన తర్వాత చర్చకు రావలసి ఉన్నది ఈ 15 రోజుల లోపున మేము అమెండ్‌మెంట్స్ ఇవ్వటానికి అవకాశము ఉన్నది ఇంకా చాలామంది సభ్యులు చాలా ఆమెండ్‌మెంట్లు ఇవ్వటానికి సిద్ధంగా ఉన్నారు కాబట్టి మంత్రిగారు ప్రవేశపెట్టిన ప్రతిపాదనను 15 రోజులు అయిన తర్వాత చర్చించాలని, దానిని యీ లోపల చర్చించటానికి వీలులేదని మీకు నా అభ్యంతరం తెలుపుతున్నాను

శ్రీ కె వెంకటరావు —అధ్యక్షా! ఇది మీరు నిర్ణయించవలసిన విషయము మీరు నేటి ఎజండాలో యీ విషయము చేర్చారు ఆ ఎజండా కాపీ నా దగ్గరకు పంపించారు మీరు ఇంకొక విషయము కూడ గమనించాలి ఇది త్వరగా పూర్తిచేసుకోకపోతే తర్వాత టైమ్ ఉండదు ముందుముందు బడ్జెటు ప్రవేశపెట్టబడటం, దానిమీద చర్చ వగైరా ఉంటుంది ఇదే ముఖ్యంగా ధనమునకు సంబంధించిన విషయము దీనిని వాయిదా వేసు కొంటూపోతే ఎట్లాగు? ఇది తమలపాకులు వగైరా వస్తువులమీద పన్ను వేయవచ్చునన్నది తప్ప ఇంకొకటి ఏమీలేదు ఇంకా 15 రోజులు టైము ఇచ్చినా కొత్తగావచ్చే విషయం ఉండదు కాబట్టి యీ విషయానికి సంబంధించిన చర్చను పోస్టుపోన్ చేయుటం అనవసరమని నా అభిప్రాయం

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు —మన రూల్సు ప్రకారం, చర్చకు 15 రోజులకు ముందు ఆ ప్రతిపాదనను టేబుల్‌మీద పెట్టాలని ఉన్నది 15 రోజులు అయిపోయిన తర్వాత మనం దానిని చర్చించవలసి ఉంటుంది కాని 15 రోజులకు ముందే దీనిని చర్చించాలంటే ఎట్లాగు?

మిస్టర్ స్పీకర్ —14 రోజులలోపల అమెండ్‌మెంట్లు ఇవ్వవచ్చునేగాని, 14 రోజుల్లో రోజూ లమెండ్‌మెంట్లు పుచ్చుకోవాలని ఎక్కడాలేదు ఇవాళ యీ ప్రతిపాదన మీా ఎదుటకు వచ్చింది సభ్యులు కొన్ని అమెండ్‌మెంట్లు ఇచ్చారు అందరు లమెండ్‌మెంట్లు ఇవ్వటానికి, టైమ్ కావాలంటే, ఇంకొక రోజు లవకాశము ఇస్తాను దీనిని మనము ఏదో ఒక రోజున చర్చిద్దాము 14 రోజుల తర్వాత తీసుకొందామనే దానిని నేను ఒప్పుకోవటము లేదు

శ్రీ కె వెంకటరావు —సెక్షన్ 5 లో క్లియర్‌గా ఉన్నదండి

"5 Power to amend Schedule —(1) The Government may from time to time, by notification, in the Andhra Pradesh Gazette add to, amend or cancel or any of the entries in the Schedule, and such notification shall specify the year from which it shall take effect

Provided that no such notification shall be made unless a draft thereof has been approved by the Legislative Assembly"

పీరియడ్ గురించి దీనిలో ఏమీాలేదు సభ్యులుచెప్పే రూలు ఇంకోదానికి సంబంధించింది పదిహేను రోజుల తర్వాత తీసుకోవాలనేది, యీా రూలు క్రిందకువచ్చేది కాదని తమకు మనవిచేస్తున్నాను

మిస్టర్ స్పీకర్ —ఒక రోజు కావాలంటే ఇస్తాము

డాక్టర్ బి గోపాలరెడ్డి —సభ్యులు సవరణలు ఇచ్చిఉన్నారు ఇది ఏమీా పెద్ద విషయము కాదు ఇది వెంటనే ఆమోదము అయితే తప్ప, ఉల్లిపాయలు మొదలైన వాటిమీాద సేల్సు టాక్సు పడదు

శ్రీ యం నాగిరెడ్డి (మాచెర్ల) —అధ్యక్షా! కరువుకాటకాలు వచ్చినప్పుడుగాని, ధరలు పడిపోయినపుడుగాని, ఆ వస్తువులపైన టాక్సు తగ్గించటానికి అవకాశాలు ఇందులో ఉన్నాయి వాటిని మనం చర్చించటానికి, వాటినిగురించి మనం మాట్లాడటానికి వీలు ఉన్నది కాబట్టి మంత్రిగారు ప్రవేశపెట్టిన ప్రతిపాదనను మనం చర్చించవలసిన అవసరము ఉన్నది కాబట్టి, మాకు కొంత టైము ఇవ్వటము అవసరమని కోరుతున్నాను

శ్రీ కె వెంకటరావు —అధ్యక్షా! 15 రోజుల తర్వాత చర్చచేసుకోవాలన్న విషయం వీరు ఇక్కడ స్పెసిఫిక్‌గా, యీా యాక్టులో 5 వ సెక్షన్ క్రింద ఒక ప్రొసీజర్ ప్రిస్క్రైబ్ చేసి, శాసనసభవారు ఇదివరకు ఆమోదించి ఉన్న తరువాత, దానినుండి తిరిగి డీవియేట్ చేయటం మొదలుపెడితే ముందుముందు లెజిస్లేషన్ చేయటమే చాలా కష్టము అవుతుంది. ప్రతి రోజూ డీవియేషన్‌చేస్తే చాలా కష్టం అవుతుంది ఇది ప్రత్యేకంగా శాసనసభా హక్కులకు భంగకర మైతే, ఇక్కడి ప్రొసీజర్‌కు విరుద్ధమైతే, మనం సరిదిద్దుకోవచ్చును అంతేగాని, ప్రతిదానికి ఒక ప్రొవిజన్ క్రియేట్‌చేస్తే, యీా యాక్టునుకూడ అమెండ్ చేసుకోవలసిన ఆవశ్యకత ఏర్పడు తుందని మనవిచేస్తున్నాను

శ్రీ పి. సుందరయ్య —ఇంకా చాలామంది సభ్యులు ప్రిపేర్ కావటానికి టయిమ్ కోరు తున్నారు ఇది రేపు ఉదయం తీసుకోండి.

మిస్టర్ స్పీకర్ —రేపు 21–2–58 వ తేదీ క్వశ్చన్ అవర్ అయిన తర్వాత ఇది తీసు కొందాము

## The Hyderabad Motor Vehicles Taxation (Andhra Pradesh Amendment) Bill, 1957

*Sri M Nagi Reddi* Sir, I beg to move

"That the Bill be circulated for eliciting public opinion"

"That the Bill be referred to a Select Committee"

*Mr Speaker* Motions moved

శ్రీ యం నాగిరెడ్డి —అధ్యక్షా, ఇంతకుముందు ప్యాసైన మద్రాసు మోటార్ వెహికిల్స్ టాక్సేషన్ బిల్లు చర్చ సందర్భంలో మంత్రిగారు మాట్లాడుతూ, హైదరాబాదు మోటార్ వెహికిల్స్ టాక్సేషన్ బిల్లు ప్రవేశపెట్టినప్పుడు చాలా వివరాలు చెబుతామని అన్నారు హైదరాబాదు మోటార్ వెహికిల్స్ టాక్సేషన్ బిల్లులో చాలా ముఖ్యమైన విషయాలున్నాయని అన్నారు మద్రాసు మోటార్ వెహికిల్స్ టాక్సేషన్ బిల్లు ప్యాస్ అయినది హైదరాబాదు మోటార్ వెహికిల్స్ టాక్సేషన్ బిల్లు ప్రవేశపెట్టేటప్పుడు చాలా వివరాలు చెబుతామన్నారేగాని మంత్రిగారు చెప్పినది ఏమీలేదు అంధ్ర ప్రాంతంలో టాక్సేషన్ ఎంత ఉంది, తెలంగాణా ప్రాంతంలో టాక్సేషన్ ఎంత ఉందో, తెలుపుతూ ఒక స్టేట్‌మెంట్ ఇచ్చారు "ఆంధ్ర ప్రాంతంలో టాక్సేషన్ చాలా ఎక్కువగా ఉంది, తెలంగాణా ప్రాంతంలో టాక్స్ చాలా తక్కువగా ఉంది ఈ రెండు ప్రాంతాలలోని టాక్స్‌ను సమానం చేయటానికి తెలంగాణాలో ఉన్న టాక్స్‌ను కొస్త కొస్త హెచ్చు చేస్తామని" చెబుతూ, మంత్రిగారు ఒక స్టేట్‌మెంట్ ఇచ్చారు యూనిఫార్మిటీ అనే పేరుతో తెలంగాణాలోఉన్న పన్నును హెచ్చుచేస్తున్నారు ఎక్కువ పన్ను ఉన్న ప్రదేశంలో కొస్త పన్ను తగ్గించి, తక్కువ పన్ను ఉన్న ప్రదేశంలో కొస్త పన్ను పెంచి, రెండు చోట్ల సమానంగా చేయటానికి యీ ప్రభుత్వంవారు ప్రయత్నిస్తున్నారా అంటే లేదు ఆ విధంగాచేసి పన్నులను సమానంగా చేయటానికి యీ బిల్లు తీసుకురావటంలేదు ఆంధ్ర ప్రాంతంలో టాక్సేషన్ ఎక్కువ ఉన్నదని ప్రభుత్వం వారే అంటున్నారు తెలంగాణాలో ఉన్నదానికన్నా 14 రెట్లు ఎక్కువగా ఆంధ్ర ప్రాంతంలో ఉన్నదని మంత్రిగారే అన్నారు ఆంధ్ర ప్రాంతంలో టాక్సేషన్ బరువు భారంగా ఉన్నదని అనుకొన్నప్పుడు, ఆ పన్నులను కొద్దిగా తగ్గించి, తెలంగాణాలో కొంచెముగా హెచ్చించటానికి ప్రయత్నం చేస్తున్నారా అంటే లేదు ఆంధ్ర ప్రాంతంలోని టాక్స్‌ను అట్లాగే ఉంచి, తెలంగాణాలోఉన్న టాక్స్‌ను మాత్రం పెంచుతున్నారు "తెలంగాణా ప్రాంతంలో పరిస్థితులు మెరుగుగా ఉన్నాయి, ఇక్కడ పన్నులు పెంచవలసిన అవసరము ఉన్నది," అనిచెప్పి, తెలంగాణాలో పన్ను పెంచుతున్నారా అంటే, అది కూడా లేదు తెలంగాణాలో ఏమాత్రం మెరుగుగా పరిస్థితులు లేవు "ఆంధ్ర ప్రాంతంలో ఎక్కువ పన్ను ఉన్నది, తెలంగాణా ప్రాంతంలో కూడా అంత పన్ను వేయటానికి ప్రయత్నం చేస్తామనే" కారణం తప్ప యీనాడు యీ పన్నును తెలంగాణా ప్రాంతంలో పెంచవలసిన పరిస్థితులు లేవనేది స్పష్టంగా కనుపిస్తోంది ఈ నాడు యీ పన్నును పెంచటానికి నూతనమైన కారణం ఏదీ ప్రభుత్వమునకు కనుపించటము లేదు

అందువల్ల ఒక్క విషయము గమనించాల్సి వున్నది ఇప్పుడు ఇక్కడ తెలంగాణాలో రహదారి సౌకర్యాలు అనేవి చాలా తక్కువగా ఉన్నవి రైల్వే సౌకర్యాలు అసలే లేవు మామూలుగా తెలంగాణా జిల్లాలో ఏమూల ప్రాంతాలకు పోవాలన్నా సృష్టిచే నిర్మాణము అయినట్టి వంటి డొంకదారులు తప్ప మరే దారులు లేవు కాకపోతే మంత్రిగారు బిల్లులో చెప్పిన "other roads" అనేవి వున్నవి వాటి ద్వారా ప్రయాణము చేయవలసిన పరిస్థితులు వున్నవి ఇలాంటి పరిస్థితులలో ప్రభుత్వము అదనపుపన్నువేస్తున్నప్పుడు వాటికి తగిన రహదారి సౌకర్యాలు కలుగజేయాలి అవి కలుగ జేసినప్పుడు, అదనపు పన్ను వేయటానికి ప్రభుత్వానికి అధికారము వుంటుంది ప్రజలకు గూడ ఒక విధముగా సౌకర్యములు ఏర్పడినట్లవుతుంది అంతేకాని ఏ సౌకర్యాలు కలుగ జేయకుండా పన్ను హెచ్చిస్తామని అంటే, అదీ న్యాయ సమ్మతము కాద ప్రజలు కూడ అందుకు హర్షించరు ఎక్కడైతే రోడ్ల సౌకర్యాలు లేకుండా, డొంకదార్ల గుండానో మరే ఇతర దార్లగుండానో లారీలు పోతున్నవో, అక్కడ depreciation fund చాలా తక్కువగా వుంటుంది ఈ సందర్భమును యింతకు ముందు తెచ్చిన బిల్లు తీసుకు వచ్చారు ఈ depreciation అనేది, కంకరరోడ్లకు, పక్కారోడ్లకు తక్కువ వుంటుంది Pucca roads లేనటువంటిచోట్ల depreciation చాలా హెచ్చుగా వుంటుంది Pucca roads కు 10 సంవత్సరములకు ఒక పర్యాయము గని repairs జరగవు Ordinary roads కు repair ఎక్కువ అందువల్ల depreciation విషయములో చాలా తేడా వుంటుంది పక్కారోడ్లమీద పది సంవత్సరములు vehicles నడిస్తే వచ్చే తరుగుదల అవికాని చోట్ల నాలుగు సంవత్సరాలకే కనబడుతుంది అందువల్ల depreciation తక్కువగా వున్నదన్న కారణములతో పన్ను హెచ్చు చేయడమన్న న్యాయము కాదు

ఇదీ కాక యిదివరకు ఎప్పుడు లేనటువంటి కొన్ని అదనపు పన్నులను ప్రభుత్వం వేయదలచు కున్నది PWD road మీద vehicles నడిస్తే ఒక రేటు అని PWD రోడ్లు కానటువంటి వాటిమీద నడిస్తే యింకొక రేటు అని అంటున్నారు PWD Roads మీద నడిస్తే మూడు రెట్లు other roads మీద అయితే రెండు రెట్లు అని అంటున్నారు ఇప్పుడు ఈ రెట్లు బిల్లులోని Table B లో Item B క్రింద నమోదు చేయబడినవి ఇలాంటి రేట్లతో పన్ను హెచ్చించడము అక్రమమని చెప్పక తప్పదు ఉదాహరణకు నల్లగొండ జిల్లాలో సూర్యపేటనుంచి మిరియాల గూడెంకు ఒక రోడ్డు వున్నది ఆ రోడ్డు వర్షాకాలములో ఉపయోగించ టానికి వీలు కాదు అది పక్కా రోడ్డు కాదు సంవత్సరములో ఏ అయిదు మాసములో తప్ప తక్కిన రోజులలో ఉపయోగించ టానికి వీలుకానటువంటి రోడ్డు ఆ అయిదు నెలలు మాత్రమే బస్సులు గాని, లారీలు గాని పోగలవు ఆ రూటులో సూర్యాపేటనుంచి జిల్లేపల్లివరకు 22 మైళ్ళు రోడ్డు లేదు అది ఊరకనే డొంకదారి అక్కడినుంచి మిరియాలగూడెంకు ఆరుమైళ్ళు అది PWD రోడ్డు ఈ మధ్య ఉన్న 22 మైళ్ళు దూరముకూడ రాళ్ళమీద రప్పలమీద బస్సులు, లారీలు, యితర కార్లు పోవలసిందే ఇందులో ఇంకొక విషయము తీసుకుని వచ్చారు ఏరోడ్డు అయినను అదిPWD రోడ్డు అయినా కాకపోయినా దారిలో ఎక్కడైనా సరే PWD, రోడ్డు ఎక్కినట్లయితే, మొత్తము distance

అంతా P W D Road మీద నడిచినట్లే considerచేస్తామని, P W D విషయములో విధించేమూడు రెట్లు అదనపు శిస్తు భరించ వలసిందే నని అంటున్నారు అలాంటప్పుడు ఇక్కడ 22 మైళ్ళు P W D వారిది కానటువంటి రోడ్డుమీద ప్రయాణము చేసి, చివరకు ఏ ఆరు మైళ్ళో P W D రోడ్డుమీద నడిపించిన కారణముచేత మొత్తము distanee అంతా P W D Road క్రింద భావించి అదనపు శిస్తు వసూలు చేస్తారు ఇదే మాదిరి రోడ్లు తెలంగాణాలో ఎన్నో వున్నవి ఒక్కొక్కచోట నలభై యాభై మైళ్ళు other than P W D Road, ఒకమైలో, రెండుమైళ్ళో P W D Road వుండేచోట్లుఉన్నవి ఇలాంటి చోట్లలో మొత్తము అంతటికీ మూడు రేట్ల చొప్పున శిస్తుచార్జిచేస్తే, ఇది అక్రమమని చెప్పవలసి వుంటుంది ప్రభుత్వము ఏదో రేట్ల సమన్వయం అనే పేరుతో తెలంగాణాలో రోడ్ల పరిస్థితిని దృష్టిలో పెట్టుకోకుండా, యీ హెచ్చింపు చేయడం న్యాయము కాదు తెలంగాణాలో యిదివరకు వున్న రేట్లు చూస్తే passenger కు మైలు ఒక్కంటికి 11 దమ్మిడీలు ఒకఅణా అనగా 5 నయా పైసలు ఉన్నది లారీలు, goods vehicles మీద తక్కువ వున్నది అంటే దానికి ఒక కారణము వున్నది ఆంధ్రలో ఎక్కడ చూచినా రోడ్డు సౌకర్యాలు వున్నవి పైగా పట్టణములు దగ్గర దగ్గరగా ఉన్నవి ఎక్కడ చూచినా traffic ఎక్కువ సరకుల రవాణాకు గిరాకి మెండుగాఉన్నది ఆంధ్రలో ఒక చోటకు లారీ వెళ్ళింది అంటే, అతనికి తిరుగు బాడుగ దొరుకుతుంది Competition మీద మైలుకు రానుపోను 0–8–0 రూ 0–12–0 రూ కే బాడుగలు దొరుకుతాయి తెలంగాణాలో రోడ్లు సౌకర్యాలు లేకపోవడమువల్ల లారీలు ఎక్కడికి వెడితే అక్కడికి పోవటానికి వీలులేక పోవడమువల్ల, మైలుకురూ 1–4–0, రూ 1 8 0 ఇచ్చినను లారీలు దొరకవు దానికి నప్పటికినీ చార్జీలు ఎక్కువగ యివ్వవలసి యున్నది అందువల్ల ఆంధ్రలోని పరిస్థితులకున్నూ తెలంగాణాలోని పరిస్థితులకున్నూ చాలా తేడాలు వున్నవి ఇలాంటి వ్యత్యాసాలతో అన్ని చోట్ల లోనూ రేట్లు సమన్వయము చేస్తామనడము న్యాయము కాదు ఇదివరకు ఆంధ్రలో మైలు ఒకటికి 7½ దమ్మిడీలు అంటే 3½ నయా పైసలో, 3¼ నయా పైసలో ఉన్నది కాని తెలంగాణా ప్రాంతానికి ఇన్ని నయా పైసలకు పన్ను మించదు అనే టటువంటిది లేదు అయి నప్పటికినీ ఈ రెండు బిల్లులు పాసు చేసినంత మాత్రాన ఇక మీదట నుంచి ప్యాసింజర్లమీద ప్రయిపేటు వ్యక్తుల చేతులలో ఉన్న Bus Passengers మీద ఈ అదనపు రేట్లు పడవు అని గాని, Goods Vehicles మీద Transport Charges అదనముగ పడవు అనిగాని మంత్రిగారు గ్యారంటీ యివ్వలేదు ఇప్పుడు వున్న రేట్లు అమల్లో ఉంటాయి అని అయినా బిల్లుద్వారా చెప్పలేదు అందువల్ల యీ రేట్లు automatic గా passengers మీద తప్పక పడే అవకాశములు ఉన్నవి అందువల్ల యిక్కడ తెలంగాణ ప్రజలయొక్క ఆర్థిక పరిస్థితులలో, ఇక్కడ వున్న రోడ్ల దుస్థితి, transport అసౌకర్యాలు, ఇక్కడ ప్రస్తుతము ఆచరణలోవున్న passenger fares goods vehicles rates ఆంధ్రతో పోల్చి తేడా చూచి, అన్ని విషయములు దృష్టిలో పెట్టుకొని ఆలోచిస్తే, ప్రస్తుతము ఈ బిల్లులద్వారా ప్రభుత్వము తలపెట్టే అదనపు పన్నుల వల్ల ముఖ్యంగాయీ తెలంగాణా ప్రజలను మరింత యిబ్బందుల పాలు చేయడమే అవుతుందని గుర్తించాలి ఇదీ కాకుండా తెలంగాణాలో సామాన్యవ్యక్తులు ఏ ఒక్కటో రెండో లారీలు పెట్టుకొని జీవించేవారు

ఆర్థికంగా ఎక్కువగ బాధలు పడవలసి వస్తుంది అందువల్ల ఈ బిల్లును అంగీకరించటానికి వీలు లేదు నిన్నటి బిల్లును అంగీకరించిన తరువాత, దీనిని మంత్రిగారు ఉపసంహరించుకుంటే మంచిదనే ఉద్దేశ్యముతో, దీనిని వ్యతిరేకరిస్తూ మాట్లాడుతున్నాము ఇప్పుడు మేము ఇచ్చిన amendment ను అంగీకరించ వలసిందిగా కోరుతున్నాము ఒకవేళ దీనిని Select Committee పంపించేటట్లయితే, అందులో వున్న సభ్యులు తెలంగాణాలోని పరిస్థితులు, ఆంధ్రలోని పరిస్థితులు అన్నీ సాకల్యంగా చర్చించి, దీనిని ఎసెంబ్లీ ముందుకు తెస్తే మంచిది అందువల్ల దీనిని మంత్రిగారు ఉపసంహరించుకోకపోతే, సెలెక్టు కమిటీకైనా పంపమని కోరుతూ నేను ఈ తీర్మానాన్ని ప్రతిపాదిస్తున్నాను

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి) —అధ్యక్షా! నేను యీ బిల్లును Select Committee కి పంపవలసిందని చేసిన ప్రతిపాదనను బలపరుస్తూ మాట్లాడుతున్నాను మనకు ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడి యిక్కడికివచ్చే టప్పుడు అక్కడ ఆంధ్రలో ఉన్న పన్నులతోబాటు అక్కడి సౌకర్యాలుకూడ ఇక్కడికి తీసుకుని వస్తున్నామన్నట్లుగా కన్పిస్తున్నది అక్కడ ఉన్న సౌకర్యాలుకూడ యిక్కడికి తీసుకొనివస్తే, సామాన్య ప్రజలు ఎక్కువగ హర్షిస్తారు ఇక్కడ తెలంగాణాలోఉన్న రేట్లు మంత్రిగారే యిచ్చారు అందులో State carriages కు 22 రెట్లు ఉన్నదని చెప్పారు తెలంగాణాలో ధర ఎట్లాఉన్నదంటే ఆంధ్రలో ఉన్నదానికి 22 రెట్లు ఉన్నదన్నారు దీనిని ఎంతవరకు పెంచుతున్నారంటే, Cent per cent కు పెంచుతున్నారని చెప్పవలసి ఉంటుంది Road vehicles అంటే లారీలకు 34 7% మాత్రమే ఇక్కడ తెలంగాణా వారు pay చేస్తూంటే దానిని Cent percent కు పెంచు తున్నారు తరువాత Motor Cars కు 50% ఉంటే దానినికూడ cent percent కు పెంచుతామని అంటున్నారు Motor Cycles కు 31–25 ఉంటే దీనిని కూడ cent percent అని అంటున్నారు Auto Rickshaws కు 41 7% ఉంటే, వాటికి కూడ cent percent అంటున్నారు Motor Cabs-Four Wheelers ఇవి కూడ 22 2% ఉంటే దానిని కూడ Cent percent అంటున్నారు Tractors కు 21 35% ఉంటే, దానిని కూడ cent percent కు పెంచాలి అంటున్నారు Trailers కు కూడ cent percent పెడతాము అంటున్నారు వీటి అన్నింటిలోకి ఒక్క trailers కే ఎక్కువచేస్తే పరవాలేదు అది న్యాయమేనని అనిపిస్తుందికాని, తక్కిన వాటి విషయమై పెంచ్చుచేయడము న్యాయముకాదని నా అభిప్రాయము ఉదాహరణకు హైదరాబాదు నగర స్థితి చూడవచ్చు ఇదివరకున్న feudal set up లో నైజాంగారు ప్రజానీకం యొక్క సౌకర్యాలు చూడకుండా యీ నగరాన్ని మాత్రం అందచందాలతో నిర్మించారు, రోడ్లన్నీ సిమెంటు చేశారు, సిమెంటు రోడ్డుల ప్రక్కన తారు వేయించారు, ఇక్కడకువచ్చిన అతిథులు, ఇతర దేశాలనుంచి, రాష్ట్రాలనుంచి ఎవరైనావస్తే వారు యీ హైదరాబాదు నగరం అంద చందాలతో చూడడానికి ఎంతో దర్జాగా, సంతోషంగా ఉన్నది అనుకునేటట్లు చేద్దామనే ప్రయత్నంతో యీ చుట్టుప్రక్కల 15, 20 గ్రామాల ప్రజలనుంచి డబ్బుతీసుకొనివచ్చి రోడ్లను బాగా గట్టిగా వేశారు. ఇప్పుడువేసే పన్ను యిక్కడ హెచ్చుగా వుండకూడదు. ఈ చుట్టు ప్రక్కలనుండి

గ్రామాల ప్రజలందరి మీదా యీ పన్నులభారం పడుతుంది వారందరికీ సౌకర్యాలు కల్పించకుండానే యిప్పుడు పన్నులు వేసేందుకు ప్రయత్నిస్తున్నారు ఆంధ్రలోనూ, మద్రాసు రాష్ట్రంలోనూ ఉండే taxation విధానాన్ని తెలంగాణా ప్రాంతానికి apply చేస్తామంటున్నారు ఇక్కడ హైదరాబాదు నగర మున్సిపాలిటీవారు ప్రతిదానిమీద పన్నులు వేస్తున్నారు ఇక్కడి Motor cycles మీద 15 రూపాయలు వేస్తున్నారని లెక్క చెప్పారు ఆంధ్ర ప్రాంతంలో రూ 48 ఉన్నదని చెపుతున్నారు ఇక్కడవేసే పన్ను అంతేకాదు హైదరాబాదు, సికింద్రాబాదు కార్పోరేషనులు 'బల్దియా' అనే పేరుతో మోటారులన్నింటి మీదా పన్ను వేస్తున్నారు ఈ పన్ను రూ 25 వరకూ వేస్తున్నారు (నయాపైసల్లో కొద్ది తేడా ఉన్నదనుకోండి) రూ 25 వేసే దానిని రూ 42 కు ఎక్కువ చేసినట్లయితే— ఎంత అవుతుందో ఆలోచించుకుంటే మన ఊహాకు కూడా అందదు సమానంగా వేస్తున్నారా, ఎక్కువా వేస్తున్నారా అనేది ఆలోచించాలి వారి ఆర్థిక స్థోమతను కూడా ఆలోచించాలి, "ఇదివరకు యీ ప్రశ్న వేసేటప్పుడు అక్కడ (ఆంధ్రలో) వొప్పుకున్నారు, కాబట్టి యిప్పుడు యిక్కడ కూడా ఒప్పుకోండి" అంటే— అది న్యాయంకాదు అసలు యీ పన్ను వేయడానికి ఆంధ్రలో అంతా ఒప్పుకున్నారా? అప్పుడు విధిలేక, ప్రభుత్వానికి మెజారిటీ ఉన్నది కాబట్టి దీనిని ఆమోదించారు అసలు ఆ పాత ప్రసంగాలు తీసిచూచినట్లయితే యీ బిల్లు వచ్చినప్పుడు అన్ని పక్షాలనుంచి అందరూ శాసన సభ్యులూ వ్యతిరేకించినట్లు తెలుస్తుంది ఆరోజున ఉన్న discipline ను బట్టి కొన్ని పరిస్థితులవల్ల దానిని అందరూ ఒప్పుకోవడం జరిగింది ఈ పరిస్థితులనన్నింటిని విడిచిపెట్టి "ఇదివరకు అంగీకరించారు కనుక యిప్పుడు అంగీకరించండి" అంటున్నారు అప్పుడు వేరే గత్యంతరం లేక అంగీకరించారు ఈనాడు కూడా 'విధిలేకనే అంగీకరించండి' అని చెప్పడం సబబుకాదు

రహదారి సౌకర్యాలు ఏమీ చేయలేదు మొన్న నేను ఈ విషయం మాట్లాడుతుంటే "ఇప్పుడు మాట్లాడకూడదు ఆ సబ్జక్టు మీద మాట్లాడాలి" అని అన్నారు నా చిన్నతనంలో మద్రాసు రాష్ట్రంలో toll gates వల్ల లాభం లేదని దానిని రద్దు చేసే ప్రయత్నంలో Motor Taxation ప్రకారం పన్నులు వసూలుచేసి అందులో కొంతభాగం జిల్లాబోర్డులకు యివ్వాలనే నిర్ణయంచేశారు వచ్చిన మొత్తమును భాగాలువారీగా యిచ్చేవారు ఎప్పుడో toll gates వున్న పద్ధతిలోనే ఆ proportions లోనే యీనాడు వసూలుచేస్తున్నారు మోటారుల మీద వచ్చే ఆదాయం మీద వేసే పన్నులు కూడా రోజురోజుకూ పెంచారు Toll gates తీసేసినప్పుడు వేసే పన్నులనే యిప్పుడు వేయలేదు అందువల్ల, motor toll gates జిల్లాబోర్డులకు యిచ్చే compensation కంటె యింకా ఎక్కువగా యివ్వవలసివచ్చింది కాని ప్రభుత్వం మాత్రం ఆ బాధ్యతను తీసుకోకుండా toll gates ఉన్న time లో ఏ compensation యిచ్చారో, అదే లెక్క కట్టి యిస్తామని అనేటట్లయితే అది న్యాయంకాదు అసలు వారు యివ్వగల పరిస్థితిలో ఉన్నారా? కారులు ఎన్ని నడుస్తున్నాయి? వాటి మీద toll gates లెక్కవేసినట్లయితే ఎంత వస్తుందది? అసలు జిల్లాబోర్డుల రోడ్ల maintenance కు డబ్బు ఎక్కడ వుంది? ప్రభుత్వంవారు దయతలచి "ఈ జిల్లాబోర్డులకు

కొంత భాగం యిస్తున్నారు బహుశా, యిక్కడ ఆ బాధే లేకుండా పోయిందనుకొంటాను ఇక్కడ--ఆట్టే రోడ్లు లేవు ఈ పరిస్థితులన్నీ ఆలోచించకుండా డబ్బు కోసం వేస్తున్నాం అంటే సరిపోదు ఈనాడున్న జిల్లాబోర్డుల పరిస్థితి ఏమిటి? అనేక రకాలైన రోడ్లు ఉన్నాయి ఈ డబ్బంతా వసూలుచేసేది లెక్కలు సరిపుచ్చడానికా? లేక ప్రజలకు అవసరమైన పనులు చేయించడానికా? మోటారుల మీద వచ్చే డబ్బును రవాణా సౌకర్యాల కొరకు ఉపయోగపరచాలి ఈనాడు ఏ పద్దులో ఎంత వచ్చినప్పటికీ, consolidated fund లోంచి తీసుకొని ఏ పనికైనా ఖర్చుచేయవచ్చుననే account system ఉన్నదనుకోండి అయినప్పటికి దానిని ఉపయోగపరచే పద్ధతి ప్రజలకు తెలియచేయకపోతే వారు చాలా బాధపడతారు ప్రభుత్వం కూడా బాధపడి తీరాలి కొన్నిచోట్ల రోడ్లు ఉండవు డబ్బు మాత్రం యిస్తారా, లేదా అని అడిగే స్థితి వస్తున్నది ఇక్కడ యీ పన్నులు వేసేటప్పుడు రోడ్లు ఏ పరిస్థితిలో ఉన్నాయో, ఆ రోడ్ల మీద కార్లు ఎట్లా నడుస్తున్నాయో అవి బయలుదేరితే గమ్యస్థానం చేరుకోగలవా అనే విషయం ఆలోచించకుండా 'ఇక్కడ ఉన్నది కనుక యిక్కడా వేస్తున్నాము' అంటున్నారు తారు రోడ్ల మీద వేసే ధరనే బజారులో వున్న old tract మీదా, డొంకదారుల మీదా వేస్తామంటే న్యాయంకాదు ఇక అక్కడి కారుల wear and tear ఏమి అవుతుంది? అది nationalisation లో వస్తుందంటారు Nationalisation విషయం వచ్చినప్పుడు, అది ప్రభుత్వానిదో లేక Transport Authority దో, కారు నడపాలంటే వారు యిచ్చేటప్పుడు మనం యిచ్చేవారిని గూర్చి ఆలోచిద్దాము తీసుకొనేటప్పుడు ప్రభుత్వంవారిని ఆలోచిద్దాము ఇంకా సౌకర్యాలు కలుగచేసేందుకు ప్రభుత్వానికి డబ్బు వస్తుంది వారి కారులు నడిచేందుకు రోడ్లున్నాయి కనుక ఆ రోడ్ల maintenance కోసం డబ్బు యిస్తున్నాము ప్రభుత్వ నిర్వహణకు కూడా కొంత భాగం యిస్తున్నాము ఈనాడు ఆంధ్రప్రదేశ్‌లోని రోడ్లు ఏ పరిస్థితిలో ఉన్నాయో చూడాలి రోడ్డు అనిపించుకోడానికి కూడా వీలులేని రోడ్లు అనేకం ఉన్నాయి. కొన్ని రోడ్లు గుంటలు పడిపోతే యీ రోడ్ల మీద పోతే ఆ గుంటల్లో కారు ఎక్కడ యిరుక్కుపోతుందోనని, పొలం భూములు కొంత గట్టిగా వుంటాయనే ఉద్దేశ్యంతో కొంతమంది పొలాల గుండా పోతారు ఈ విధంగా ప్రయాణంలో అసౌకర్యాలు పొందడం జరుగుతున్నది "ఈ రోడ్ల స్థితి, బస్సుల స్థితి యీ విధంగా ఉన్నది కదా, మీరు లైసెన్సులు ఎట్లా యిచ్చారు" అని Transport Authority ని అడిగితే "అయితే యిక ముందునుంచి లైసెన్సులు రద్దు చేస్తామంటారు, మనకు కావలసినది లైసెన్సులు రద్దుచేయడమా, కారులు సరిగా నడవడానికి సౌకర్యాలా అనేది ఆలోచించాలి కారులు నడవడానికి తగిన సౌకర్యాలు కల్పించడానికి డబ్బు వసూలు చేస్తున్నారు కాని రోడ్డు రవాణా సౌకర్యాలు మాత్రము కలుగచేయడం కాదు

Road transport హెచ్చుగా పెరిగింది బస్సులు పెరిగాయి, అని చెప్పవచ్చు కాని అట్లా పెరగడం సంతోషించవలసిన విషయమే నాగరికతకు లక్షణాలు జనం ఎక్కువగా పెరగటం, వ్యాపారం పెరగడం, ఆ వ్యాపారం రీత్యా రహదారులు పెరగడం, జనానికి కావలసిన వృత్తులు పెరగడం, వృత్తులున్నబట్టి living standard పెరగడం, సౌకర్యాల కొరకు యింకా ఖర్చుచేసుకోడానికి మార్పులు తీసుకురావడం, అట్టి వృత్తోగమునందే

మనం ఉన్నామనే విషయంలో ఏమీసందేహం లేదు కాని రోడ్ల స్థితిచూచినప్పుడు మాత్రం అనుమానం కల్గుతున్నది అసలు రోడ్లు ఏ పద్ధతిలో ఉండాలి, వాటికి బాగుచేసేవారు ఎవరైనాడున్నారా? జిల్లా బోర్డుకు యివ్వవలసిన డబ్బు ఎందువల్ల యివ్వడంలేదు? ఇచ్చిన డబ్బులో దామాషా ప్రకారం ఎందువల్ల mark చేయడంలేదు? ఆంధ్ర దేశంలో రైల్వే సెస్సు లున్నాయి మోటారు రవాణా అట్లాఉండగా, రైల్వేసెస్సులువసూలు చేసిన డబ్బు ఎట్లా ఖర్చుచేస్తున్నారో యింతవరకు తెలియదు దానిని జిల్లా బోర్డుల పూర్వపు రోడ్ల రవాణా క్రిందకు మార్చాలన్నారు ఈవేళకూడా అదేరకంగా మారుస్తున్నారు రైల్వే సెస్సు యింకా కొన్నిచోట్ల జిల్లాబోర్డుల account లో ఉన్నది దానిని ఎందుకు వినియోగిస్తున్నారు? అంటే "యింకా పెద్దరోడ్లు, వంతెనలు కావాలికదా? వాటికోసమై అట్టేపెడతా మన్నారు దానిని divert చేసి general account లోనికి పంపించారు రహదారులకోసం శాసనాచట్టం ప్రకారం ప్రజలనుంచి వసూలు చేస్తున్నామని చెప్పి ఆ డబ్బు general fund లోనికి తీసుకోవడం ఏమిన్యాయం? Motor transport కోసం వసూలుచేసే డబ్బు రహదారులకోసం వినియోగించకుండా, వినియోగించే అవకాశంలేకుండా యీనాడున్న accountancy system ప్రకారం consolidated account లోనికి అన్ని accounts కలుస్తాయి అన్ని accounts నిమిత్తం కూడా ఖర్చు చేయుకోవచ్చు ఈ విధమైనటువంటి accountancy, audit system వల్ల రోడ్ల రవాణావిషయం చాలా అస్తవ్యస్తంగా ఉన్నది దానిని మార్చడానికి మనకువచ్చే ఆదాయంలో కొంత percentage యిస్తున్నాము ఆంధ్ర ప్రాంతంలో old toll gate system లేదనికాదు తెలంగాణా ఏరియాలోకూడా రోడ్డు రవాణా అభివృద్ధి కావాలి ఈ పరిస్థితులలో యిప్పుడు ఉన్న old toll gate system ను రద్దు చేస్తున్నామని ప్రకటన చేయుకుండానే యీ బిల్లును తీసుకురావడం న్యాయంకాదని మనవిచేస్తున్నాను అసలు taxation ప్రారంభించిన సిద్ధాంతం ఇదే Motors పై Provincial Government పన్నులు వేయిక తప్పదు ఒక మోటారుబస్సు వుంటే దానిపై జిల్లాబోర్డుకు కొంత డబ్బువచ్చేది కాని ప్రభుత్వం ఆ పద్ధతి రద్దుచేసింది ప్రభుత్వమే తీసుకొని జిల్లాబోర్డులకు compensation గా యివ్వడం మొదలుపెట్టింది ఈ పరిస్థితిలోఉన్న దానిని తెలంగాణాకుకూడా అనువర్తింపచేసే అవకాశం ఉన్నది ఈ బిల్లును సమగ్రంగా ఆలోచించి చేసినట్లయితే దానిని రాష్ట్ర వ్యాపితంగా అమలుచేసే అవకాశం ఉంటుంది ఇంత క్రితంవచ్చిన బిల్లును రాష్ట్ర వ్యాపితంగానే చేశాము రాష్ట్ర వ్యాపితంగాఉన్న బిల్లులను తెలంగాణాకు కూడా వర్తింపచేసి సమన్వయం చేస్తున్నాము ఆంధ్రలోవలెనే యిక్కడ కూడా పన్నులు పడతాయి ఎవరికి హెచ్చు జీతాలు వున్నారు ఆంధ్ర ప్రాంతంలోవున్న ఆ సౌకర్యాలను మాత్రం monopoly గా పుచ్చుకొని సౌకర్యాలను మాత్రం అడుగవద్దంటున్నారు ఆంధ్ర ప్రాంతంలో తక్కువ జీతాలు తక్కువ T A లు, తక్కువ D A లుఉంటే వాటితో తెలంగాణా జీతాలను సమన్వయం చేస్తామంటున్నారు ఉద్యోగుల జీతాలు, ప్రజల సౌకర్యాలు క్రిందకు గుంజేదల, పన్నుల భారం ప్రజలనెత్తిపైన వేయడం central policy గా నేడు కనిపిస్తున్నది. తెలంగాణా

ఆంధ్ర integration లాగా విచారస్థితికి వచ్చిందనే అసంతృప్తిని కలిగిస్తుందనే విషయం మరిచిపోవద్దు ఇవన్నీ తీవ్రంగా ఆలోచించినప్పుడు దీనిని సెలెక్టు కమిటీకి పంపించడం చాలా బాగుంటుందని కోరుతూ విరమిస్తున్నాను

శ్రీ షేక్ మౌలాసాహెబ్ (ఉదయగిరి) అధ్యక్షా, మంత్రిగారు ప్రవేశపెట్టిన బిల్లును బలపరుస్తూ కొన్ని సూచనలను చేయదలచాను ఇతర దేశాలలో ప్రతి పల్లెటూరుకి 4 ½ మైళ్ల రోడ్డు వంతన వున్నదని వింటున్నాం కాని ఆంధ్రప్రదేశ్‌లో ఆ దామాషాను అర మైలు రోడ్డు కూడాలేదు ఎక్కువగా రోడ్లకు ఖర్చుపెడుతున్నారని చెప్పారు చాలా సంతోష మైన విషయం దారి సౌకర్యము లేనిదే ఏ దేశమైనా ఆర్థికాభివృద్ధి చెంది నాగరికత ఏర్పడదు అందువల్ల రోడ్లు అత్యంత ఆవశ్యకములు కాని రోడ్లకొరకై జిల్లాలలో ఖర్చు పెట్టబడే డబ్బును బాగుపడిన ప్రాంతాలకే కాక వెనుకబడిన పల్లె ప్రాంతాలకు, దారి సౌకర్యాలు లేక డొంకదారులున్న ప్రాంతాలకే హెచ్చుగా వినియోగించాలి ఇండియా ప్రభుత్వం యిచ్చిన డబ్బుతో మన జిల్లా బోర్డులవారు కొన్ని రోడ్లను నిర్మించారు కొన్ని మట్టి రోడ్లు అసంపూర్ణంగా వున్నాయి వాటిని పూర్తిగా నిర్మించాలని ఎన్నిసార్లు సూచించినా ప్రభుత్వం గుర్తించలేదు ఉదాహరణకు ఉదయగిరి నియోజకవర్గ లో వారు యిచ్చిన రోడ్ల జాబితా విచారకరంగావుంది నామమాత్రంగా నాలుగయిదు మైళ్ళ రోడ్లువేసి కొదవ ఇరవై మైళ్ల రోడ్డును విడిచిపెట్టారు ఎన్నడూ ఖర్చుపెట్టని ప్రాంతాలు నా నియోజకవర్గంలో వున్నాయి వాటికి priority యిచ్చి డబ్బు కేటాయించాలి Sales Tax రావాలంటే ఎగుమతి దిగుమతి వ్యాపారం జరగాలి వ్యాపారం జరగాలంటే రోడ్లు బాగుపడాలి ఎక్కువగా Sales Tax కట్టేది కూలినాలిచేసే శ్రీకే పేదప్రజలే గొప్పవారు అన్ని సరకులు ఒకేసారి కొని నిలవచేసుకుంటారు బీదవాళ్లే తరచుబజారుకిపోయి కొనుక్కుంటారు వారు కూలికపోవడానికి రోడ్డు సౌకర్యం చాలా అవసరం అందుచేత దారి సౌకర్యాలులేని ప్రాంతాలకు ప్రాధాన్యం యివ్వాలి P W D అనీ, Highways అనీ జిల్లాబోర్డు అని తేడాలు చూపకుండా కనీసం మట్టి రోడ్లనయినా నిర్మించాలి కావలసిన సౌకర్యాలు యిచ్చేటప్పుడు ఆ సౌకర్యాలు అందరికీ సమానమైన దృక్పథంతో అందుబాటులో వుండే టట్లు చేస్తారనీ ఆ ప్రకారంగా 1958–59వ సంవత్సరంలో ఉదయగిరి నియోజకవర్గంలో కొంత దారి సౌకర్యం కలుగజేస్తారని ఆశిస్తూ, యీ అవకాశం యిచ్చినందుకు వందనములు సమర్పిస్తూ విరమిస్తున్నాను

శ్రీ బి శ్రీరామమూర్తి —అధ్యక్షా! ఈ బిల్లు మీద సభలో చాలామంది సభ్యులు మాట్లాడారు రెండు విషయాలు మాత్రం మనవిచేసి విరమిస్తాను కాంగ్రెసు ప్రభుత్వం సోషలిస్టు ఆశయాన్ని తీసుకున్న తరువాత సమానత్వం కోసముచేసిన మొదటి ప్రయత్నం పన్నులు పెంచడం ద్వారా కనబడుతుంది. ఆంధ్రలో పన్నులు ఎక్కువకాకుండా తెలంగాణాలో పెంచడం జరుగుతున్నది సమానత్వ సాధనకు ఇదీ యొక ఉదాహరణ! ఇదీ కాంగ్రెసు తరహా సోషలిజమ్ పనిచేస్తున్న విధానమా అనిపిస్తున్నది నీరు మీదనుంచి క్రిందకి పారితే యీ పన్నులు క్రిందనుంచి మీదకి వెళుతూవున్నాయి ఇదే వున్న తేడా! ఈ పన్నుల సంగతి చూస్తే [illegible]

రామలింగడి కథ జ్ఞాపకమువస్తున్నది చచిపోయిన తండ్రికి వాతలు పెట్టమని తప్పినిసి వచ్చి, బ్రాహ్మణులకు వాతలు పెట్టినట్లు యీ సమావేశ్య సాధనలో తెలంగాణాకు పన్నులనే వాతలు పెడుతున్నారు పన్నులు పెంచడం ద్వారా సహాయ్యం సంపాదించాలని చేసిన యీ పెండిటి ప్రయత్నం కొంతవరకు విచారకరము, ఆశ్చర్యకరము ఈ రెండిటిని కలిపిన స్థితిలో నేను తమకు మనవిచేస్తున్నాను నిజముగా పన్నులు వేయడం ఏ ఒక్కరూ కాదనరు ఎందుకంటే పన్ను లేకుండా ప్రభుత్వము నడవదు ఏ ప్రభుత్వమయినా పన్నులు పుచ్చుకొంటుంది అందులో ఆశ్చర్యపోయేమి కొత్త యేమీలేదు పన్నులను ప్రజలు వ్యతిరేకించడంలో కూడా ఒక కారణం వుంటుంది వచ్చిన డబ్బు ఏ రకంగా ఖర్చుచేస్తున్నారనే విషయం కూడా ప్రజలు ఆలోచిస్తుంటారు ఆలోచించడం సహజమే కూడా ఈరోజున ప్రభుత్వం పన్నులు రాబట్టడం తప్పిస్తే, వచ్చిన పన్నును ఖర్చుచేసే విషయంలో ప్రజలకే విధమైన బాధ్యతాలేని పరిస్థితిలో వ్యవహరిస్తున్నారని ప్రతి ఒక్కరికీ తెలుసును "బడ్జెటులో లోటుంటే ఏ విధముగా భర్తీచేయవలెనో? ఈ విధానంకంటె మెరుగైన మరో విధానం చూపండి" అని సామాన్యంగా ప్రభుత్వం తరఫున అడగడం మామూలు అయితే పన్ను ఏ రకంగా ఎంతుండాలో ప్రభుత్వానికి సూచించవలసిన అవసరం వుంది కాని వచ్చింది ఏ రకంగా ఖర్చు చేయాలో వారికి ఎవరూ చెప్పనక్కరలేదు ఆ విధానం వారికి బాగా తెలుసును అందుచేత యీ రకంగా ప్రజా సమస్యలను పరిష్కరించటానికి ప్రభుత్వం సహకరించనంతవరకూ పన్నులు అదనంగా రాబట్టాలని ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నంతో ప్రజలు సహకరించడం చాలవరకు కష్టంగా ఉంటుంది ఈరోజున మోటారు వాహనముల మీద, బస్సుల మీద పన్నులు వేస్తున్నప్పుడు తెలంగాణా ప్రాంతంవారి అవసరాలను ప్రభుత్వం తీర్చడానికి కృషిచేస్తున్నదా అంటే అటువంటిది జరగడంలేదు ఆ రోడ్లను గురించి అక్కడి పరిస్థితులను గురించి చాలమంది మాట్లాడారు, స్పష్టంగా చెప్పారు రోడ్లు గుంటలుపడి వారి సౌకర్యాలు లేవని చెప్పారు ఆంధ్ర ప్రాంతంవారు పన్నులను భరిస్తే తెలంగాణావారు ఎందుకు భరించరాదని ప్రశ్నిస్తే సరైన జవాబు ఏ రకంగా చెప్పాలో అని నేను బాధపడుతున్నాను తెలంగాణా ప్రాంతంవారు తక్కువ పన్ను చెల్లిస్తుండగా ఆంధ్రప్రాంతం వారు ఎందుకు ఎక్కువ చెల్లించాలి? అది కూడా చేయడానికి అవకాశంలేదు కేవలం పన్నులు పెంచే విధానమే ప్రభుత్వం శాశ్వతంగా ఉంచుకున్నట్లయితే అది ప్రజల మీద భారం ఉంచడమే అవుతుంది ప్రభుత్వం తమ బాధ్యతలను నిర్వర్తించకుండా ఉన్నట్లయితే అటువంటి పన్నుల విధానం మీద ప్రజలు హెచ్చు ఉత్సాహం చూపించలేరని మనవిచేస్తున్నాను శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్యగారు చెప్పినట్లు ప్రస్తుతం toll gates దగ్గర పన్నులు వసూలుచేసే పద్ధతి వుండగా యింకా అదనంగా ఆ భారం పెంచడం బాగుగాలేదు ఉదాహరణకు శ్రీకాకుళం జిల్లాలో బస్సులు జయపూరు పోయినట్లయితే ఆంధ్రప్రాంతం పన్ను చెల్లించడమే కాకుండా, ఒరిస్సా ప్రాంతంలో పన్ను కూడా చెల్లిస్తున్నారు అందువల్ల రెండు ప్రాంతాలలోను పన్ను చెల్లించవలసి వస్తుంది ఆ పన్ను కాస్త పెరిగితే ఆఖరుకు ఏ ప్రభుత్వపు పెద్దలు ఎక్కువచేశారో తెలియదు కాని ప్రజల నెత్తిమీద హెచ్చు రేట్లు పడే ప్రమాదం ఉన్నదని అనుమానపడుతున్నాము ఈ రోజున పన్నుల విధానంలో ప్రభుత్వానికి ఒక స్థిరమైన సరియైన దృక్పథం లేని కారణంగా, అప్పుడప్పుడు ఏదో రూపంలో ఏదో కొంత పన్ను హెచ్చుచేయాలనే ఆలోచన వున్న కారణంగా

అనేక రకాలైన అనర్థాలకు దారితీస్తోంది ఈ అనర్థాలలో ముఖ్యమైనది తెలంగాణా ఆంధ్రులు రెండూ కలసిన తరువాత తెలంగాణా ప్రాంతంవారు దెబ్బతింటున్నారనే భీతి ప్రజలలో కలగడం అది కూడా దృష్టిలో పెట్టుకుని ప్రభుత్వంవారు దీనిని గురించి పునరాలోచన చేయాలని విజ్ఞప్తిచేస్తూ శలవు తీసుకుంటున్నాను

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు ఈరోజు ఈ బిల్లు వస్తుందనే ఉద్దేశ్యంతో నిన్న వివరంగా మాట్లాడకుండా, ముఖ్య విషయాలు ఈరోజుకు రిజర్వుచేసుకొన్నాను

ఈ బిల్లు యొక్క ప్రాముఖ్యత గురించి నేను విపులంగా చెప్పనవసరంలేదు ప్రతి బిల్లు ప్రవేశపెట్టబోయే ముందు చెప్పినట్లుగానే ఈ బిల్లును గురించికూడా మంత్రిగారు చెప్పారు తెలంగాణాను అభివృద్ధిచేయాలి కనుక డబ్బు కావాలి, పన్నులు వేయకపోతే డబ్బు ఎలావస్తుంది? అభివృద్ధి చేయటానికి డబ్బు అవసరం కనుక పన్నులు వేస్తున్నాము మంత్రిగారు చెబుతున్నారు మంత్రిగారు నా ప్రసంగాలను వింటే డబ్బును రాబట్టే విధానాలను నేను చెప్పగలను మంత్రిగారు నేను చెప్పేది వినకుండా ఎవరితోనో మాట్లాడుతుంటే నేను ఎవరికి చెప్పాలి?

డాక్టర్ బి గోపాలరెడ్డి అధ్యక్షా, గౌరవ సభ్యులు Chair ను address చేస్తున్నారా?

*Sri Pillalamarri Venkateswarlu* I am addressing the hon Minister through the Chair

*The Minister for Local Administration (Sri K Brahamananda Reddi)* —Mr Speaker Sir, that is not correct He has to address the Chair only

*Mr Speaker*–Yes, let the hon Member address the Chair

*Sri Pillalamarri Venkateswarlu* What about the Ministers? Are they hearing or talking?

*Mr Speaker* They will be hearing

*Sri Pillalamarri Venkateswarlu* —They are not hearing.

*Mr Speaker* They will give proper reply Why is the hon Member afraid?

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు డబ్బు వచ్చే విధానాలు మేము అనేకం సూచించాము తెలంగాణాలో సుమారు 8 కోట్ల రూపాయలు పరిశ్రమలలో పెట్టారు ఆ పరిశ్రమలను సక్రమంగా నడుపుకొంటే ఎక్కువ లాభాలు వచ్చే అవకాశాలున్నాయి వాటిని సక్రమంగా నడపకపోవటంవల్ల కొన్నిటిలో లాభాలు లేక కొన్నిటిలో నష్టాలు వస్తున్నాయి. పరిశ్రమలు సక్రమంగా నడపటం మాని, ప్రజల పైనే పన్నుల భారం మోపటం సరైన పద్ధతి కాదని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను రోడ్డు ట్రాన్స్‌పోర్టు డిపార్టుమెంటుతో రావలసిన ఆదాయం రావటంలేదు. అందుచేత చాగ్లా కమీషన్ వంటి ఒక కమీషన్ను నియమించి విచారణ చేయించాలని నేను నిన్ననే మనవిచేశాను మద్రాసులో 7 పైసలు వసూలుచేసి 37 లక్షలు సంపాదిస్తున్నారు ఇక్కడ 11 పైసలు వసూలుచేసి 7 లక్షలు సంపాదిస్తున్నారు

డాక్టర్ బి గోపాలరెడ్డి అదంతా గడచిపోయిన కథ ఈ సంవత్సరం RTD వల్ల 38 లక్షలు వస్తుందని అంచనా వేశాము ఇక్కడ ఉద్యోగస్థుల వేతనాలు ఎక్కువగా ఉన్నాయి దానికి కారణం ఇది ముందు రైల్వేశాఖక్రింద వుండేది అందువల్ల ఆ legacy వస్తుంది అవన్నీ దర్యాప్తు చేస్తున్నాము అందుచేత పదేపదే RTD విషయం చెప్పటం మంచిదికాదు

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు—ఇంకా చెబితే ఇంకా బాగా దర్యాప్తుచేస్తారని చెబుతున్నాను ఇక్కడి ఉద్యోగస్థుల జీతాలు ఎక్కువగా ఉన్నాయని మంత్రిగారు చెప్పారు ఎక్కువ వున్నాయని నేను అనుకోవటంలేదు ఆంధ్రలో తక్కువగా వున్నాయి కనుక ఇవి ఎక్కువగా కన్పించవచ్చు ఇవి ఇక్కడివారికి సరిపోయేటట్లుగా వున్నాయని అనుకోవటం పొరపాటు

డాక్టర్ బి గోపాలరెడ్డి కేరళలోకంటే ఎక్కువగా వున్నాయి

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు కేరళలో బస్‌వారికంటే రైల్వేవారికి ఎక్కువగా వుండవచ్చు రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగస్థుల జీతాలకంటె కేంద్రప్రభుత్వ ఉద్యోగస్థుల వేతనాలు ఎక్కువగా వున్నాయి రైల్వేశాఖ క్రింద వుండటంవల్ల అదృష్టవశాత్తు ఇక్కడివారికి ఎక్కువ జీతాలున్నాయి వారి జీతాలను తగ్గించే అవకాశము లేదు కనుకనే ఈ ప్రభుత్వము వారి జీతాలను తగించలేదు ఈ RTD ని ఆంధ్రప్రాంతానికి కూడా వర్తింపచేయాలనే ఉద్దేశము వున్నప్పుడు, అక్కడ వారి జీతాలు ఏ విధంగా వుండాలనే సమస్య వుంది

ప్రభుత్వమునకు అధికంగా లాభాలు రావాలని కోరుకొంటున్నప్పుడు, ఆ ప్రభుత్వము క్రింద పని చేస్తున్నవారికి, కార్మికుల సరైన కూలీ ఇవ్వకుండా వుండడం పెట్టుబడిదారులంటే అధ్వాన్నంగా ప్రవర్తించటమే అవుతుంది ఆంధ్రలో బస్సులను నేషనలైజ్ చేసిన తరువాత, అక్కడివారికి, తెలంగాణా లో వున్నవారికి ఇస్తున్న జీతాలనే ఇవ్వాలని నేను మంత్రిగారికి విజ్ఞప్తి చేస్తున్నాను అలా అక్కడకూడా జీతాలు పెంచినప్పుడే అక్కడి డ్రైవరులనుండి తగినంత ప్రోత్సాహం వస్తుంది అప్పుడే ఈ ప్రభుత్వ నిర్ణయాన్ని వారు హృదయపూర్వకంగా బలపరుస్తారు ఆ విషయాన్ని మంత్రిగారు గుర్తించాలని కోరుతున్నాను

ప్రస్తుతం ఈ రోజు తెలంగాణాలో రేట్లు పెంచడానికిముందు ఆలోచించవలసిన విషయములను గురించి అనేకమంది మిత్రులుచెప్పారు ప్రజల యొక్క ఆర్థిక పరిస్థితిగురించి ఆలోచించి, వారు ఈ అదనపు భారాన్ని భరించగలరో, లేదో విచారించాలి ఇక్కడ ఇండ్ల పరిస్థితి ఆలోచించాలి ఇవన్నీ ఆలోచించకుండా ఆంధ్రలో ఎక్కువ వున్నాయి, తెలంగాణాలో తక్కువగా వున్నాయి కనుక తెలంగాణాలో పెంచుతున్నామని చెప్పటం న్యాయంకాదు ఇక్కడ రోడ్లు సరిగాలేక [illegible] తక్కువగా వున్నాయి అందువల్ల వ్యాపారము తక్కువగా వుంటున్నది దాని ఆపరేటర్లకు తక్కువ లాభాలు వస్తున్నాయి ఇవన్నీ ఆలోచిస్తే ఆంధ్రలో ప్రమాణం [illegible]

అనుకోవటం పొరపాటు అవుతుంది ఆంధ్రలోఉన్న రేట్లే ఎక్కువ ప్రపంచంలో ఎక్కడా లేని రేట్లు ఆంధ్రలో ఉన్నాయి అందుచేత ఇక్కడ పెంచటం భావ్యంకాదు

ఈ సందర్భంలో టోల్‌గేట్ గురించి చాలామంది మిత్రులు చెప్పారు అది రద్దుచేస్తామని మంత్రిగారు చెప్పలేదు రేట్లు పెంచడం, పన్ను పెంచటం, సర్చార్జిపేరట జరిగినా యింకా టోల్‌గేట్ ఒక్కొక్కచోట 4, 5 6, 7 రూ కూడా వసూలు చేస్తున్నారు నెలకు 150 రూ లు టోల్‌గేట్ ద్వారా స్థానిక సంస్థలకు చెల్లించుకోవలసి వస్తోంది ఈ విధంగా సుమారు రు 1,400 లు ప్రతి సంవత్సరము లారీ ఓనర్స్ చెల్లించుకోవలసి వస్తున్నది అందుచేత ఈ పద్ధతిని రద్దుచేయాలి మొదట టోల్‌గేట్లను రద్దుచేసి ఆ తరువాత ఈ పన్ను పెంచినట్లయితే "టోల్‌గేట్లు రద్దుచేశారుగనుక పన్ను పెంచినా మనం సహకరించవచ్చు" అనే అభిప్రాయం లారీ ఆపరేటర్లకు కల్గవచ్చును కాని టోల్‌గేట్లను రద్దుచేసే విషయం ఆలోచించకుండా, ఎప్పుడో ఆలోచిస్తామని చెప్పతూ ఇప్పుడు ఎందుకు వాయిదా వేస్తున్నారో, ఏమి ఆటంకాలు వున్నాయో నాకు అర్థంకావటంలేదు

మంత్రిగారు మాట్లాడుతూ డబుల్ టాక్సేషన్ లేకుండా చేస్తామని చెప్పారు కాని అదిలేకుండా చేయదలుచుకొన్నప్పుడు అటువంటి క్లాజు ఒకటి ఈ బిల్లులో ఎందుకు పెట్టలేదని నేను అడుగుతున్నాను డబుల్ టాక్సేషన్ అనేది న్యాయరీత్యా చెల్లనిదని అయినా మన ప్రభుత్వము ఆ పనిని కొనసాగిస్తూనేవుంది కనుక డబుల్ టాక్సేషన్ లేకుండా చూడవలసిన అవసరంవుంది అందుచేత ఈ విషయాలన్నీ ఆలోచించటానికిగాను ఈ బిల్లును తప్పక సెలెక్టు కమిటీకి పంపవలసిన అవసరంవుంది Hyderabad Motor Vehicles taxation Act ను క్షుణ్ణంగా పరిశీలించినట్లయితే కొన్ని విషయాలు బోధపడతవి ఆంధ్ర, మద్రాసు చట్టాల ప్రకారం quarterly payments ఉంటాయి హైదరాబాదు చట్టం ప్రకారం ఆరు నెలలకు కట్టవలసివస్తోంది సంవత్సరానికి, ఆరు నెలలకు కట్టినట్లయితే 10% ఎక్కువ కట్టవలసి వస్తోంది

డాక్టర్ బి గోపాలరెడ్డి —రూల్సును ఈక్వల్‌చేసి ఆంధ్రలో ఉన్నట్లు నాలుగు ఇన్‌స్టాల్‌మెంట్సు పెట్టుకొందాము

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు — మంత్రిగారు "అన్ని రూల్సులో provide చేస్తాము" అంటారు Statutory Act లో ఉన్నదానికి విరుద్ధంగా రూల్సు ఎట్లా provide చేస్తారో నాకు అర్థంకావటంలేదు, అందుకోసమే సెలక్టు కమిటీని వేయుటకు అంగీకరించమని చెప్పతున్నాను మనం అంతా సెలెక్టు కమిటీలో కూర్చుని దానిని చర్చించవచ్చును అట్లాకాకపోతే ఏమైనా ఎమెండుమెంట్సును తీసుకురండి అప్పుడు ఆలోచించవచ్చును. అదీ ఏమీచేయకుండా మేము తీసివేస్తామని మాటలుచెప్పుతే సరిపోదు అందువల్ల దీనిని బిల్లులో provide చెయ్యాలాలేదా అనేది సెలక్టు కమిటీ లో విచారించ వచ్చును. Act లో State Road Fund ను ఏర్పాటుచేశారు 1957 లో ప్రవేశపెట్టిన బడ్జెట్టు మెమోరాండంలో దానిని రద్దు చేస్తాన్నాం" అన్నారు Finance

statement లో ఒక వాక్యము వ్రాసినందువల్ల ప్రభుత్వానికి ఆ provision రద్దుచేయడానికి ఎట్లా హక్కు కలుగుతుందో నాకు బోధపడడంలేదు ఈ విధముగా చట్ట విరుద్ధమైన చర్యలు ప్రభుత్వం తీసుకొంటోంది అసలు Act ను అంతా క్షుణ్ణంగా పరిశీలించి, దానిలో సక్రమంగా సవరణలు చేయడానికి ఎన్నడూ పూనుకోడంలేదు Vehicles కొన్ని నెలలు పనిచేయకుండా ఉంటాయి అప్పుడుకూడ పన్నులువసూలు చేయడం జరుగుతున్నది వానాకాలంలో వెహికల్ చెడిపోయినందువలన నికాని ఏ కారణంవల్ల నైనా, ఒక వెహికల్ పనిచేయకుండా దానంతటది ఉండిపోయినట్లయితే, ఆ వెహికిల్ మీద కూడ పన్నులు వసూలుచేయడానికి వీలులేకుండా మనం ఈ చట్టంలో కొన్ని provisions చేయవలసిన అవసరం ఉంది ఈ విషయంకూడ ఆలోచించాలని విజ్ఞప్తి చేస్తున్నాను ఇందాక మిత్రుడు నాగిరెడ్డి ఒక విషయం మీదృష్టికి తీసుకువచ్చారు లారీలుగాని, బస్సులుగాని కొంత PWD రోడ్లమీద, కొంత నాటు రోడ్లమీద ప్రయాణం చేస్తున్నప్పుడు, PWD రోడ్లు ఎక్కినంతమాత్రాన, దానికి ఆ రేటును చెల్లించాలని ప్రభుత్వం ఈ రోజున కోరుతున్నది ఇది సరియైన పద్ధతికాదు ఈ రోజున PWD రోడ్డుమీద నాలుగు మైళ్ళు ఒక Vehicle నడచినతరువాత, అంతానాటు రోడ్డుమీద ప్రయాణముచేసినప్పటికీ, ఆ Vehicle PWD రోడ్డు ఎక్కింది కదా అని, దానికి కూడ PWD రేట్లే కట్టాలని ఈ చట్టం కోరుతూన్నది దీనినికూడ సవరణ చేయవలసిన అవసరం ఎంతైనా ఉన్నదని ప్రభుత్వానికి తెలియజేస్తున్నాను ఇవన్నీ చట్టంలో ఉన్నటువంటి లోట్లు ఇందాక వావిలాల గోపాలకృష్ణయ్యగారు కూడ తెలియజేశారు కొన్నికొన్ని చెడిపోయినబండ్లు ఉంటాయి దానిమీద కూడ పన్నులు వసూలు చేస్తున్నారు

డాక్టర్ బి గోపాలరెడ్డి —ఒక క్వార్టరు నడవకపోతే pay చేయనక్కరలేదు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు —అయితే ఒక నెల నడవకపోతే వసూలు చేస్తారా? ఇటువంటివన్నీ ఉన్నాయి కాబట్టి సెలక్టు కమిటీలో ఆలోచించవచ్చు

మిస్టర్ స్పీకర్ —సెలక్టు కమిటీకి పోతే కదా!

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు ఇన్‌వేలిడ్ కారేజెస్ మీద కూడ వసూలుచేస్తున్నారు హైదరాబాదు ఆక్టు ప్రకారం 20 రూపాయలో, ఎంతో, వసూలుచేస్తున్నారు అది ఎందుకూ పనికిరాకుండా మూలపడేసుకుని ఉంచుకొన్నందుకుగాను 20 రూ లు పన్ను చెల్లించవలసిన అవసరం ఉన్నదా అని అడుగుతున్నాను

మిస్టర్ స్పీకర్ మళ్ళీ బాగుచేస్తారేమో అనుకొని

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు బాగుచేస్తే వసూలుచేయవచ్చును బాగు చేస్తారు కదా అని వసూలుచేయడం భావ్యంకాదు Invalid carriages కు పన్ను, చక్రానికి ఒక పన్ను, మడ్గారుకు ఒక పన్ను ఈ విధముగా పన్నులు వేస్తున్నారు ఇందువల్ల Motor Vehicles Taxation Act ముఖ్యంగా సెలక్టు కమిటీకి పోతేనే, యివన్నీ సరిచేయ

గల్గుతాము ఇందులో కొన్ని provide చేయవలసియున్నది Hyderabad Act లోని ప్రధానమైన లోపాలను సవరించాలి మూడు నెలలకు ఒక రేటు ఆరు నెలలకు ఒక రేటు, సంవత్సరానికి ఒక రేటు ఉన్నది మంత్రిగారికి అన్ని అధికారాలు వారి చేతుల్లో ఉన్నా, చట్టాన్ని సవరిస్తేనేగాని వారు ఏమీచేయలేరు దానిని సవరిద్దాము కాని రూల్సులో చేరుస్తాము అంటే ఎవరికి తృప్తికరంగా ఉండదు అదే విధముగా double taxation ఉంది అది లేకుండా చేస్తాము అన్నారు ఎట్లాచేస్తారు అని అడుగుతున్నాం? తరువాత టోలు గేట్సు విషయం ఏమిటి? గోపాల కృష్ణయ్యగారు కొంతచెప్పారు 1938వ సం॥లో ప్యాసు అయిన చట్టం ద్వారా, మూడు సంవత్సరాల ఆదాయం సగటుచేసి, మ్యునిసిపాలిటీలకు, జిల్లాబోర్డులకు యిస్తున్నారు కాని యిటీవల మాకు కూడ గుర్తుంటుంది ఆ టోలుగేట్ల ఆదాయాన్ని కూడ ప్రభుత్వమే కాజేస్తున్నది ఇది కూడా ఆలోచించాలి ఈ టోలుగేట్ల ఆదాయం షేర్సును allot చేయవలసిన అవసరం వుంది ఇది ఏమీచేయకుండా ఒక పన్నుల విషయం ఆలోచించి, ఒక చట్టాన్ని తీసుకునిరావడం, సరిగా లేదని విజ్ఞప్తిచేస్తున్నాను ఆ రకంగా చేస్తేనే గాని ఇప్పుడు ఉండే సమస్యలు అన్ని పరిష్కారంకావు ఇప్పుడు ఆ ప్ర తెలంగాణాలు కలిసిపోయిన తరువాత పన్నులు ఎక్కువచేసే కార్యక్రమానికి పూనుకున్నట్లయితే తెలంగాణా ప్రజలుగాని, మరి ఎవరూగాని హర్షించరు అన్నిచోట్లా అసంతృప్తివస్తుంది ఈ పన్ను ఎక్కువచేయడం అంటే ఒక్క తెలంగాణా లారీలమీదనే ఎక్కువ వేయడం కాదు ఈ శాసనం ప్రకారం, ఏ కృష్ణా, గుంటూరు లేక నెల్లూరు జిల్లాల లారీలు హైదరాబాదుకు రాకుండా ఎప్పుడూ ఉంటాయి అనుకోవడం పొరపాటు హైదరాబాదుకు వచ్చినట్లయితే ఈ పన్నును అవి కూడ భరించవలసివస్తుంది ఈ పన్ను చెల్లిస్తూ టోల్ గేట్లకు అదనంగా సర్‌చార్జి కట్టినట్లయితే లారీ ఆపరేటర్లకు ఏమి లాభం ఉంటుంది? ఎవరైనా లారీ నడుపుకోడానికి వీలు ఉంటుందా? ఇవన్నీ ఆలోచించాలని కోరుతున్నాను మరో విషయం మోటారుల్లో, ముఖ్యంగా చిన్నచిన్న కార్ల మీద అదనంగా పన్నులు వేయడం సరిగాలేదని విజ్ఞప్తి చేస్తున్నాను వీటినన్నిటిని గురించి చర్చించాలంటే సెలెక్టు కమిటీకి పంపితేనే వీలువుతుంది

ఒకరోజు సెలెక్టు కమిటీలో కూర్చున్నట్లయితే, మరునాడు చట్టం చేయడానికి వీలుంటుంది కనుక తప్పకుండా సెలెక్టు కమిటీకి పంపించమని విజ్ఞప్తిచేస్తున్నాను

*శ్రీ కె యల్ నరసింహారావు (ఎల్లందు—జనరల్) —అధ్యక్షా, ఈ బిల్లు ద్వారా తెలంగాణా ప్రాంతంలో Vehicles మీద Taxes పెంచడము జరిగింది అయితే మంత్రిగారు దానికి ఒక కారణంచెప్పారు అదేమిటంటే ఆంధ్రప్రాంతంలో వున్న Vehicles owners యిదివరకే పెద్ద ఎత్తున పన్నులు చెల్లిస్తున్నారు మనం ఒకే రాష్ట్రం క్రింద ఉంటున్నాం. ఈ ద్వంద్వ విధానాలతో Administration చాలా యిబ్బందులకు లోను అవుతోందని, ఈ ద్వంద్వవిధానాన్ని తొలగించి ఏదో ఒక్క పద్ధతితోనే వ్యవహారాన్ని నడపడంకోసం మేము తీసుకువస్తున్నాం అనిచెప్పారు అదీ కాక తెలంగాణా ప్రాంతంలో Vehicles మీద పన్నులు చాలా తక్కువగా వున్నాయి, అందుచేత పెంచినది తీసుకువస్తున్నామనే రీతిగాచెప్పారు అంతే కాకుండా ఎక్కడైతే ఎక్కువ పన్నువుందో దానిని తగ్గించడానికి ప్రయత్నం చేయకూడదా? అన్న ప్రశ్న

వహా Second Five-Year Plan లో తగ్గించడమనే ప్రశ్న లేనేలేదన్న సమాధానంచెప్పారు వారిచ్చిన లెక్కల ప్రకారం యదార్థపరిస్థితులను మనం పరిశీలిస్తే ఆంధ్రను తెలంగాణాతో పోల్చి చూస్తే యీ Vehicles మీద తక్కువ పన్ను ఉన్నదని మనం అంగీకరించాలి అందులోనూ తేడా కూడా చాలా ఎక్కువగా వుందని నేను అంగీకరిస్తున్నాను కానీ లక్కడకు యిక్కడకు ఒకే భేదంవుంది అక్కడి ఆర్థిక పరిస్థితి ఇక్కడిదానికి తేడా వున్నదని ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు నిన్న ఒక meeting లోమన స్పీకరుగారు మాట్లాడుతూ తెలంగాణా ప్రాంతంలో హైదరాబాదు సిటీ ఒక దీపంగావుందని, చుట్టూ అంతా చీకటిగా వుందని ఆ చీకటిలోపల హైదరాబాదు సిటీ అభివృద్ధిచెందాలంటే, గోదావరినీరు తెలంగాణా మీద ప్రవహించి హైదరాబాద్ చుట్టుప్రక్కల వున్న ప్రాంతమంతా సస్యశ్యామలమై అభివృద్ధి చెందాలని అన్నారు హైదరాబాద్‌లో వున్న cement roadsను, లేక పెద్ద బంగాళాలను చూచి తెలంగాణా అంతా అభివృద్ధిచెందినది అనుకోవడం మాత్రం మనలను మనం మోసగించుకొన్నట్లే అవుతుంది అందుకని దానిని అభివృద్ధిచెయ్యడం ఎట్లా? దానికి ప్రయత్నించడంకోసం మనం పూనుకోవాలని చెప్పారు దానిని పరిశీలించడమేకాకండా యిక్కడ పన్నులు తక్కువగా వుండడానికి యింకా కారణమున్నది పన్నులు తక్కువగా వున్నాయంటే మనం ఒక్క Act మాత్రమే తీసుకొని పరిశీలించినప్పుడు పన్నులు తక్కువగానే కన్పించవచ్చు కాని ఏ lorry owners, Bus owners పన్ను తక్కువగా చెల్లించడంలేదు తెలంగాణాలోని lorry owners ఆంధ్రలోనివారు చెల్లిస్తున్న పన్ను ఇపుడు ఇస్తున్నారు Bus owners విషయంలో పన్నులు పెంచే సమస్య వచ్చినపుడు Buses P W D Roads మీద ప్రయాణంచేసినట్లయితే 3 రెట్లు పెంచుతున్నారు ఆ P W D. Roads కాని Roads యిక్కడ చాలా తక్కువ వున్నాయి అయినప్పటికీ ఆ ప్రాంతంలో రెండు రెట్లు అంటే యీపేళ్ళ వున్నదానికి double చేస్తున్నారన్నమాట అయితే వారి యిబ్బందులను మనం పరిశీలించవలసి వుంది నాకు తెలిసినంతవరకు ఇల్లెందునుంచి సమ్మంపేట్టువరకు ఒక bus వెళ్తుతుంది ఇది 35 మైళ్ల రూటు దానిలో రెండు మైళ్ళు R T D Roads మీద ప్రయాణంచేస్తుంది ఆ bus ఈ రెండు మైళ్ళు ప్రయాణం చేసేనందుకుగాను, దానిని R T D Roads ప్రయాణంచేసే Vehicle గా పరిగణిస్తారా? లేకపోతే బళ్ళుగాడి మీద ప్రయాణంచేస్తున్నట్టి Vehicle గా పరిగణిస్తారా అన్నది ఒక ముఖ్య సమస్య అవుతున్నది - అంతే కాకుండా ఆ Bus owner వర్షాకాలం పోగానే 33 Miles మట్టిరోడ్డును వేలకొద్ది రూపాయలు పెట్టి బాగుచేసికోవలసిన అవసరం ఏర్పడుతోంది వారికి రూటు మాత్రం ప్రభుత్వం యిచ్చింది కాని ఆ తోవలను బాగుచేసే బాధ్యత మాత్రం ప్రభుత్వం తీసుకోలేదు అందువల్ల కొన్ని వందలు, వేల రూపాయలు ఖర్చుపెట్టి ఆ తోవలను బాగుచేసికునే పరిస్థితి ఏర్పడుతోంది అంతే కాకుండా Toll Gates విషయం యిక్కడ చాలా ముఖ్యమైంది ఆంధ్రప్రాంతంలో Toll gates పేరే లేవన్నది స్పష్టపడుతోంది నాకు ఎరుక ఉన్నంతవరకు ఒక లారీ ఖమ్మం నుంచి ఇల్లెందు చేరుకోవాలంటే ప్రతిరోజూ రూ 3 చెల్లించుకోవలసిన అవసరం ఉన్నది ఈ రూ 3 ప్రకారం మనం చూసినట్లయితే అతడు ఎంత చెల్లిస్తాడన్నది మనం పరిశీలించవలసియున్నది. ఇక్కడ లారీ

లన్నీ కూడా సాధారణంగా R T D రోడ్ల మీద వాటాయి మీరిచ్చిన లెక్కల ప్రకారం యీ ప్రాంతంలోని Lorry owners రూ 400 చెల్లిస్తున్నారు దానిని రూ 500 చెయ్యబోతున్నారు యిప్పుడు ఆంధ్రలో రూ 1400 చెల్లిస్తున్నారని మీరు లెక్కలు చూపిస్తున్నారు అయితే యిప్పుడు ఖమ్మం నుంచి ఒక లారీ హైదరాబాదు రావాలంటే యిక్కడ లారీ డ్రైవరు రూ 4 లు Toll Gates క్రింద చెల్లించుకోవలసిన అవసరం వుందన్నమాట Average గా మనం చూసినట్లయితే అతను రోడ్ల మీద ప్రయాణంచేస్తే ప్రతి వంద మైళ్ళకు Telengana ప్రాంతంలో కనీసం రూ 4 Toll gates పేరుతో చెల్లించవలసిన అవసరం వుంది ఈ లెక్కల ప్రకారం మనం చూస్తే సంవత్సరానికి అతను రూ 1440 Toll Gates మాత్రమే చెల్లిస్తున్నాడ ఇప్పుడున్న రూ 400ల దానికి కలిపితే మొత్తం రూ 1840 అతను చెల్లిస్తున్నాడన్నమాట అందుచేత యీ Toll Gates అనే సమస్యను మనం పరిష్కరించాలి ఈ Toll Gates ద్వారా వారి మీద పెద్ద ఎత్తున పన్ను పడతున్నది Toll gates సమస్యను పరిష్కరించకుండా యీ lorry మీద అదనంగా పన్నువేయడం న్యాయంకాదు ఈవేళ మనం Bus owners మీద కూడా పన్నువేయబోతున్నాం ఇక్కడి Private Bus routes అన్నీ R T D roads కాని వాటి మీదనే R T D roads కానివి సాధారణంగా Telangana లో తక్కువనే చెప్పాలి ఏమైనా యిస్తే బండ్లదార్ల మీద మాత్రం యిస్తున్నారు లేక Cart tracts మీద ప్రయాణంచేసే 10 రోజులకొకసారైన రూ 50 లేక 100 లో వారు తప్పనిసరిగా ఖర్చుచేయవలసిన అవసరం ఏర్పడుతోంది Private Buses వాళ్ళ మీద విధించే పన్నుల విధానం ఏమాత్రం న్యాయమనిపించుకోదు ఆ రోడ్డు మరమ్మత్తుచేసే బాధ్యత ప్రభుత్వం తీసుకోవడంలేదు Toll gate system ను రద్దుచేసేందుకు ప్రభుత్వం పూనుకోవడంలేదు ఈ రకంగాచేసినపుడు, యీ lorry owners కాని bus owners కాని యీ బళ్ళ దార్ల మీద ప్రయాణంచేయడంవల్ల ప్రతి సంవత్సరము ఎలా ఖర్చుపెట్టుకుంటున్నారో, అలాగే Toll gates కు వారు చెల్లిస్తున్నది మనం లెక్కలోకి తీసుకుంటే యీవేళ ఆంధ్రలో చెల్లిస్తున్న పన్నుకు దరిదాపుగానే, కొన్ని సందర్భాలలో ఎక్కువ, చెల్లిస్తున్నారు కాని దానికంటె తక్కువగా చెల్లిస్తున్నారనడానికి అవకాశంలేదు. ఈ రీతిగా దీనిని పరిశీలించవలసిన అవసరం ఉన్నది దానిని పరిశీలించినపుడే ఆంధ్రలో ఎక్కువ వున్నదని లేక యిక్కడ తక్కువ వుందని కాని చెప్పుకోడానికి మనకు అధికారం హక్కు లభిస్తుంది ఇతర Acts ననుసరించి, వారి మీద ప్రతినిత్యం వేసే పన్నులను పరిశీలించకుండా మనం యీ ఒక్క Act మాత్రం దృష్టిలో పెట్టుకొని, దీని ద్వారా విధించుచుండే పన్ను మాత్రం దృష్టిలో పెట్టుకొని పన్నులు ఎక్కువగా వున్నవని చూపించడంకోసం ప్రయత్నిస్తున్నాము అది సరైనది కాదు న్యాయమనిపించుకోదు అంతే కాదు ఈ విధమైన Acts ద్వారా యీ Lorry owners మీద Bus owners మీద లేక యితర vehicles మీద వేసే పన్నులను పరిశీలించాలి అన్యాయం జరగకుండా పన్నులు విధించే ఏర్పాటుచేయాలి

[*Sri S Ranganadha Mudaliar in the Chair* ]

ఈ బిల్లును Select Committee కి పంపడం బాగుంటుంది అయితే యీ పన్నులు quarterly గా చెల్లించె పద్ధతిలో లోపాలు, వున్నాయని యింతకు ముందు శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లుగారు చెప్పారు రూల్సు ప్రకారం ఆ concession యిచ్చే అధికారం వుందాలేదా అన్నది ఒక సమస్య క్రిందకు వస్తోంది కనుక అట్లాంటి వన్నీ పరిశీలించి మార్పుకోవాలంటే అది దీర్ఘకాలం Select Committee కి పంపనవసరం కూడాలేదు 1–2 రోజులలోపు మనం దీనిని క్షుణ్ణంగా పరిశీలించి ఒక సవ్యమైన Act గా తీసుకరావలసిన అవసరంవుంది దీనివల్ల యితరులు బాధలకు గురి అవుతున్నారు కాబట్టి దీనిని పరిశీలించవలసిన అవసరం వుంది అంతేకాదు, దీనిని ముఖ్యంగా Select Committee కి పంపడానికి మీరు తోడ్పడాలని, తప్పకుండా మంత్రిగారు దీన్ని Select Committee కి పంపడానికి అంగీకరిస్తారని ఆశిస్తున్నాను ఈ కష్టాలను తొలగించడానికి Select Committee లో పూర్తి అవకాశం వుంటుంది అందుచేత Select Committee కి పంపడం అవసరం, న్యాయం ఒకవేళ Select Committee కి పంపకుండా యిక్కడే pass చేయాలని పట్టుపడితే చాలా అన్యాయంచేసినవారు అవుతారని మంత్రిగారు జ్ఞాపకం వుంచుకోవలసిందిగా కోరుతూ ముగిస్తున్నాను

శ్రీ బి శంకరయ్య (బుచ్చిరెడ్డిపాలెం—జనరల్) —అధ్యక్షా! ఈ బిల్లు ప్రవేశపెట్టినప్పుడే మంత్రిగారు, "యీ బిల్లువల్ల ప్రయాణీకులమీద అదనంగా ఛార్జీలు ఏమీ వసూలు చేయవీలులేదని చెప్పారు ఆ విధంగా ప్రజలమీద పన్నులు పడకుండా ఉండడానికి అవకాశం ఉందా? అని చూస్తే అలా కనపడడంలేదు ఇప్పుడు తెలంగాణాలో ఉండేటటువంటి ఇన్సురేట్లు ఆంధ్ర ప్రాంతంలోకన్నా కూడా చాల ఎక్కువగా ఉన్నాయని అందరికీ తెలుసు మైలుకు ఇక్కడ పదకొండు పైసలు చెల్లిస్తూయున్నారు ఆంధ్రలో 7 పైసలు మాత్రమే ఈ విషయం ప్రభుత్వానికి ఇదివరకే తెలుసును బస్‌లు, లారీలపై పన్నులు పెంచినప్పుడు వారు ప్రయాణీకులపై పెంచుతున్నారు ఈ విషయాలన్నీ బయటపెట్టకుండా ప్రయాణీకులపై పెంచబడవని చెప్పుతూ ఉన్నారు ఇంకా, ఇక్కడ Toll Gate Tax వల్ల లారీ యజమానులు, బస్సు యజమానులు అదనపు పన్నులు చెల్లిస్తూ ఉన్నారని నిన్న మంత్రిగారు చెప్పారు ఎంత తేడాఉందో చూడండి? ప్రతి నూరు మైళ్ళకు Toll Gate వల్ల, రోజుకు నాలుగు రూపాయలచొప్పున చెల్లిస్తూ ఉన్నారు అనగా సంవత్సరానికి రు 1,200 కంటె ఎక్కువగానే చెల్లిస్తున్నారు కావున ఇవన్నీకూడా లెక్క కట్టుకున్నప్పుడు ఇక్కడివారు తక్కువ పన్నులు చెల్లించడంలేదు ఈ ఒక్క చట్టంలో provide చేసిన పన్నులేకాదు, తక్కినవేవి ఉన్నప్పటికీని, మనం చట్టంచేసేటప్పుడు, వాళ్ళు ఈ పన్నులవల్ల ఎంతభరించవలసి వస్తుందో చూడాలి ఈ చట్టంవల్ల బస్సులో 26 మంది ప్రయాణం చేసినటువంటి వారికి ఇప్పుడు మూడు వందల ఇరవై రూపాయలు ఉండే దానిని మూడు రెట్లకు, అనగా 960 రూపాయలకు పెంచుతూ ఉన్నారు ఇంతేకాకుండా మరి 36 రూపాయలు 'for every additional person

beyond 26, అని చెబుతూ ఆవిధంగా పెంచుతూ ఉన్నారు ఈ విధంగా 26 మంది మొదలుకొని 32 మంది passenger ల వరకు పోయేటటువంటి బస్సుపై సుమారు 1,846 రూపాయలవరకు పన్ను పెంచుతూన్నారన్నమాట సీట్లనే లెక్కించగా 22-8-0 లెక్కన, surcharge వేసినాము ఆ విధంగా రూ 270 క పెంచింది ఇప్పుడు ఈ 26 మంది passengers కు కూడా రూ 36 లు చొప్పున అయితే అదొక 936 రూ అవుతుంది ఆ విధంగా రూ 1,846-6-0 అయింది ఈ 26 మంది మొదలుకొని, 32 మందివరకు ప్రయాణం చేసేటటువంటి బస్సుమీద, సీట్లనే వేసినటువంటి పన్నుతో కూడా 270 రూ కలుపుకుంటే 1 846 కు పెరుగుతుంది ఇప్పుడు దేం రూ 640 కాకుండా దాదాపు 16 వందల రూపాయలు 26 మంది passengers పైన పడుతుంది అదేవిధంగా ఇంకా పెద్ద బస్సులు తీసుకున్నట్లయితే దానిమీద రెండువేల రూపాయల పన్ను పడుతుంది ఈ విధంగా ఒక్క పెద్ద బస్సుమీద 2 వేలు, చిన్న బస్సుమీద సుమారు 16 వందల రూపాయలు అదనంగా పన్ను పడుతున్నప్పుడు ఇది passenger ల మీద పెంచకుండా ఏ విధంగా చెయ్యగల్గుతారో ఆలోచించవలసి ఉన్నది ఈ additional Tax మరియు నెలకు 22½ రూ surcharge, ఇవన్నీ కూడా బస్సువాళ్లు చాలాచోట్ల ప్రయాణీకులమీద వేస్తారు ఇక్కడ ఉండే Toll Gates రద్దు కావడంలేదు ఈ విధమైన double taxation పోవాలని ఇక్కడ స్పష్టంగా చెప్తాను ఇవన్నీ ఉండగా ఒక్కొక్క బస్సుమీద ఇప్పుడు రెండువేల రూపాయలు అదనంగా పన్నువేస్తే ఏమీ బాగుండదు ఇక్కడ P W D రోడ్లపై తిరిగే బస్సులన్నీ ఎక్కువగా ప్రభుత్వ బస్సులుగా ఉంటున్నాయి పల్లె రోడ్లమీద తిరిగే బస్సు private owners విగా ఉంటున్నాయి ఇలా Private owners గా ఉంటున్నవారు ఆంధ్ర ప్రాంతంలో ఎక్కువగా ఉన్నారన్న సంగతి మనకు తెలిసిన విషయమే Private road లు చెడిపోయినపుడు, అందరికన్న ఎక్కువగా ఈ బస్సు యజమానులు డబ్బు ఖర్చుపెట్టి మరమ్మతు చేస్తేనేగాని ఆ బస్సులలో ప్రయాణం చేయుటకు వీలుండదు వాళ్ళకు వచ్చేటటువంటి డబ్బులో ఎక్కువ భాగము ఆ విధంగా మరమ్మత్తులకు ఖర్చు పెట్టవలసివస్తుంది అందువల్ల ప్రభుత్వం ఏ బాధ్యత తీసుకోకుండ, మరమ్మతు చెయ్యకుండా, Metal Road వెయ్యకుండా అక్కడ ఉన్నవారిమీద ఈ విధంగా 2 వేల రూపాయలు పన్ను వెయ్యడం, ఏవిధంగా న్యాయమో ఆలోచించాలని కోరుతున్నాను అదిలాబాద్‌నుండి హైదరాబాదుకు రావాలంటే 18 రూపాయలు Toll Gate ఇచ్చేటటువంటి పరిస్థితి ఉంది దీనిని తగ్గిస్తామని ప్రభుత్వం వారెందుకు అనడంలేదు? పంచవర్ష ప్రణాళిక జయప్రదంకావాలంటే జాస్తిగా పన్నులు వెయ్యమని ఎవరూ అనడంలేదు ప్రజల సహకారమే ముఖ్యమని కేంద్ర ప్రభుత్వం, ఈ ప్రభుత్వం కూడా అంగీకరించింది కావున తొందరపడకుండా ఈ బిల్లును సెలక్టు కమిటీకి పంపిస్తే బాగుంటుంది ఇకముందు ప్రభుత్వ ఆదాయంలో ఎక్కువ భాగం ఈ ప్రభుత్వం నడిపేటటువంటి పరిశ్రమలవల్ల రావాలి రావడానికి కావలసినటువంటి వాతావరణం ప్రజలలో కలిగించాలి ఒకవైపు Toll Tax ఉంచుకొని మరొకవైపు త్వరపడి ఇప్పుడు ఈ బిల్లును తీసుకు రావలసిన పరిస్థితి ఏమీలేదు ఈ విషయాలన్నీ తెలుసుకొని తరువాత ఓటుచేసినప్పుడు ఇందులో సవరణలు కూడా తీసుకొనిరావడానికి అవకాశం ఉంటుంది ఇదంతా 10 నిముషాల్లోనో

అరగంటలోనో చర్చించవలసిన విషయంకాదు కావున తప్పకుండా దీనిని సెలక్టు కమిటీకి పంపడానికి ఒప్పుకునేటట్లు చూడాలని మీ ద్వారా విజ్ఞప్తిచేస్తూ విరమించుతున్నాను

*డా బి గోపాలరెడ్డి —అధ్యక్షా! నిన్న మధ్యాహ్నం నుండి Motor Vehicles taxation మీద చర్చిస్తున్నాము అందులో చాలా విషయాలు బిల్లుకు సంబంధించినవి వచ్చినవి ఇంకా double taxation, nationalisation గురించి గూడా మాట్లాడారు నేషనలైజేషన్‌కు నేను వ్యతిరేకినని గూడ అన్నారు ఈ బిల్లువల్ల మాకు తొమ్మిది లక్షల తొంబయి ఒక్క వేయి రూపాయిలు మాత్రమే ఆదాయంవస్తుంది అందులో R T D బస్సులవల్ల మూడు లక్షలు వస్తుంది ఇక పోతే ఆరు లక్షలు మాత్రమే పబ్లిక్‌నుండి వస్తుంది ఈ ఆరు లక్షల కోసము ఎంతో చర్చిస్తున్నాము ఇక తెలంగాణా ఆర్థికంగా చాలా వెనుకబడిన ప్రాంతమని చెప్పుతున్నారు ఆంధ్రదేశంలో యున్న taxation కేవలం ఒక్క కృష్ణా , గుంటూరు జిల్లాలోనే కాదు భద్రాచలం, వెంకటాపురం, దర్శి, పొదిలి మొదలగు వెనుకబడిన తాలూకాలలో గూడ బస్సులున్నవి అంతేకాకుండా మాచర్ల దగ్గర గురజాల కూడ వెనుకబడిన ప్రాంతమే కాబట్టి taxationకు వెనుకబడిన ప్రాంతాలనిగాని, ముందుబడిన ప్రాంతాలనిగాని తేడాలేదు ఆరు లక్షలు మాత్రమే వస్తుంది అది పెద్ద మొత్తమేమీకాదు ఇందులో, ట్రాక్టర్లుకలవారు మోటార్లుకలవారు, సైకిళ్ళు ఆటోరిక్షాలు కలవారు, లారీలు, బస్సులు గలవారు ఉన్నారు వీరందరివల్ల, ఆరు లక్షలు మాత్రం లభిస్తుంది ఇది ఏమంత పెద్ద విషయంకాదు

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు —ఇంత చిన్న మొత్తానికి బిల్లుదేనికి ?

డాక్టరు బి గోపాలరెడ్డి —చిన్నచిన్న బిందువులే పెద్ద సింధువౌతుందని అన్నారు అందువల్ల అవి కావాలి తక్కినవాటి విషయమై ఎల్లా ఉన్నా కచ్చా రోడ్ల మీద నడిచే బస్సులవారు చాలా ఖర్చుపెట్టుకుంటున్నారు వాటికి wear and tear గూడా చాలా ఎక్కువగా ఉంటుంది తర్వాత వారు టోల్‌గేట్ కూడా కట్టవలసియుంటుందని చెప్పుతున్నారు వాస్తవమే కావచ్చును కాని ఇప్పుడు ఆంధ్రజిల్లాలలో ఉన్న taxation, ఇక్కడ వుండే taxation లెక్క ఏ చాగ్లా కమిషన్ లాంటిదయినా చూచినట్లయితే ఇది చాలా దారుణంగా కనబడుతుంది ఇంత వ్యత్యాసం ఉండరాదు బస్సులకు సంబంధించినంతవరకు పదునాలుగు రెట్లు వ్యత్యాసంవుంది ఇక్కడ వంద రూపాయలువుంటే, అక్కడ రూ 1400 వుంది ఒక బస్సు యజమాని బెజవాడ లో రూ 1400 కడితే సూర్యాపేటలో రూ 100 మాత్రమే కడుతున్నారు ఇక్కడ Toll Gate, మున్సిపల్ టాక్సీలున్నవని నాకు తెలుసు ఈ బిల్లు పాసైపోయిన తర్వాత అవన్నీ గూడ విచారించే అవకాశంవస్తుంది తర్వాత అది ఇది రెండూ ఎలాగో అలాగు సమానంచేయాలి గదా అలాగే శాశ్వతంగా వుండడానికి వీలులేదు సాధ్యమైనంత త్వరలోనే మనము వీటి నన్నింటిని సమన్వయం చేసుకోవాలి ఇది ప్యాసుచేసిన తర్వాత తప్పకుండా double taxation విషయం పరిశీలనచేద్దాము ఆంధ్రప్రదేశ్ అంతా ఒక్కటైనప్పుడు ఇక్కడి లారీ అక్కడికి పోయినప్పుడుగాని, అక్కడి లారీ ఇక్కడికి వచ్చినప్పుడుగాని double taxation

వుండడం భావ్యంకాదు ఇది కొత్తగావేసే పన్ను ఐతే సెలెక్టు కమిటీకి పంపవలయునని అడుగవచ్చును కాని ఇదివరకు ఉన్నదానిని కొద్దిగానైనా సమానత్వాన్ని సాధించడానికి తయారుచేసేనటువంటిది ఈ బిల్లు శంకరయ్యగారు చాలా లెక్కలుచెప్పారు ఒక్క లారీకి నెలకు 22–8–0 రూ॥లు ఈ యాని ఈ Act క్రింద సంవత్సరానికి నూరు రూపాయలు ఎక్కువగాఇస్తారు అంటే నెలకు 8–4–0 ఎక్కువగాఇస్తారు అనగా నెలకు మొత్తం రూ 30–12–0 అదనంగా చెల్లించవలసివుంటుంది ఇదేమీ పెద్ద విషయం కాదు బెజవాడలో చూస్తే ఇంతకన్న చాలా ఎక్కువగా కడుతున్నారు మేము రెవ్యూ చేసేటప్పుడు ఈ కచ్చారోడ్ల విషయం పరిశీలిస్తాము ఇప్పుడు వాటి విషయం దారుణంగా ఉన్నదనుకొంటే సమగ్రంగాచేయడానికి ప్రయత్నించుతాము కావాలంటే అప్పుడే, సెలెక్ట కమిటీకి పంపుకోవడం మంచిది

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు —అయితే ఇప్పుడు కచ్చారోడ్లను వదలిపేసి మిగతాది చూద్దాము వాటి సంగతి రెవ్యూచేసిన తర్వాత చూసుకోవచ్చును

డాక్టరు బి గోపాలరెడ్డి —అంటే ఏమన్నమాట ? వాటికి పన్ను నాలుగు వందలే వుంచి, అటువంటి బస్సులే భద్రాచలంలో, వెంకటాపురంలో వుంటే రూ 5440 తీసుకోండి అనే గదా వారు చెప్పేది? భద్రాచలంలో, కూనవరంలో వెంకటాపురంలో ఏజెన్సీ ప్రాంతంలో చింత పల్లిలో బస్సులున్నాయిగదా ! వాటిమీద రూ 5440 తీసుకున్నా పరవాలేదనేనా వారు చెప్పేది ?

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు — లేదు అది కూడ తగ్గించవలెననే

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య —అది న్యాయంగాలేదని అందరమూ భావిస్తున్నావ ౹ మీరు అది అన్యాయమని అంగీకరిస్తున్నారు గాబట్టి అక్కడిది గూడ తగ్గించండి

డాక్టర్ బి గోపాలరెడ్డి —నేను ఏ వీ అంగీకరించడంలేను రూ 5440 వుండడం అన్యాయమని నేను అనుకోవడంలేదు ఇప్పుడు అదికట్టుతూ వెంకటాపురంలో, చింతలపల్లిలో బస్సులు నడుస్తున్నాయి అరకువాలీలో, యింకా చిత్తూరు కడప జిల్లాలలో వున్నాయనుకోండి అక్కడ గూడా రోడ్లు బాగాలేవండి అందువల్ల అక్కడ రూ 5440 ఇక్కడ నాలుగు వందలే వుంచండి అనడం ఏమి న్యాయమండి? ఇది ఎమోషనల్ ఇంటెగ్రేషన్‌కు చాలా ప్రతిబంధకంగా వుంటుందేమోనని

శ్రీ వి కె నాయక్ —ఇక్కడ average running mileage ఎంత ?

డాక్టర్ బి గోపాలరెడ్డి లారీలకు ఇదమిద్దమనిలేదు రెండు, మూడు జిల్లాలకు అనుమతులు వుంటవి వారివారి గిరాకీనిబట్టి అవి నడుస్తుంటాయి బస్సులు దాదాపు నూరు, నూటయాభై మైళ్లు వుండవచ్చును

శ్రీ వి కె నాయక్ ఇక్కడ highest route lenght 60 మైళ్ళు lowest route length 7 మైళ్ళు పట్టణంలో వున్నటువంటి 66 బస్సులలో 34 బస్సులు కంట్రాక్టర్లవి పోతే మిగతావి 37 బస్సులు ఇవి ఏడు మైళ్ళు ప్రయాణాన్ని చేస్తూ రోజుకు నాలుగు ట్రిప్పులుచేస్తవి వారు గూడ ఈ కొత్తచట్టంవల్ల పన్నెండువందల రూపాయలు ఇవ్వవలసివుంటుంది

డాక్టర్ బి గోపాలరెడ్డి -ఏడు మైళ్ళ వంతున నాలుగు ట్రిప్పులకు 56 మైళ్ళ అవుతుంది కదా ? ఆంధ్రలో బెజవాడ మొదలగు ప్రాంతాలలో సిటీ బస్సులు అలా నడుస్తూండవచ్చు అయినప్పటికీ యికముందు సాధ్యమైనంతవరకూ సిటీ చుట్టుపట్ల వంద మైళ్ళవరకు నడుపుకోవడానికి అంగీకరించవలసిందిగా మేము Transport Commissioner కు వ్రాశాము వారికి అలాంటి అవకాశం తప్పక యివ్వాలి

శ్రీ పి నరసింగరావు (మాజూరాబాద్-జనరల్) Run చేయడానికి వీలులేక కాదు రోడ్లు బాగా లేక యేదో ఒక round about గా చేస్తామని అనుకుంటున్నారు

డాక్టర్ బి గోపాలరెడ్డి ఈ తేడా చూస్తుంటే నాకు అనుమానముగావుంది తెలంగాణాలో శ్రీ యం నరసింగరావు గారు మంత్రి అయిన తర్వాత, నాకు తెలిసినంతవరకు తెలంగాణాలో రోడ్లకోసము యెక్కువగానే ఖర్చుపెట్టుతున్నారు రాబోయే బడ్జెటులో ఈ పద్దు క్రింద యెంత ఖర్చుచేసేది వారు చెప్పగలరు

శ్రీ పి నరసింగరావు రోడ్లువేసిన తరువాత యెక్కువచేస్తే బాగుంటుంది గాని అదేమియు లేకుండా యీ బస్‌లపై పన్నులు విధించడము యేమంత సబబుగాలేదని మనవిచేస్తున్నాను

డాక్టర్ బి గోపాలరెడ్డి -పెళ్ళి అయితే పిచ్చి కుదురుతుందా, లేక పిచ్చి కుదిరితే పెళ్ళి అవుతుందా అన్నట్టు ముందు డబ్బుకావాలి అప్పుడు ఆ డబ్బుతో రోడ్లను బాగుచేయడమవుతుంది వారు రోడ్లను బాగుచేయనిదే డబ్బు అడగవద్దు అంటున్నారు ఎవరో ఒకరు ముందుకు రావాలి అందుచేత యీ బిల్లువల్ల తెలంగాణాకు సంబంధించినంతవరకు ప్రభుత్వమునకు సాలీనా అదనముగా 6 లక్షల రూపాయిలు రాగలవని నేను ముందుగానే చెప్పియున్నాను

ఒక గౌ॥ సభ్యుడు అధ్యక్షా, Toll gates తీసివేసిన తరువాత దీనిని గూర్చి ఆలోచిస్తే బాగుంటుంది

డాక్టర్ బి గోపాలరెడ్డి నేను మొదట్లోనే చెప్పాను ఈ బిల్లు వల్ల ప్రభుత్వమునకు 9 లక్షలు రూపాయలవరకు ఆదాయము రాగలదు అందులో 3 లక్షల రూపాయలు R T D బస్సులు మీద రాగలదు మిగిలిన ఆరు లక్షల రూపాయలు Toll gates రద్దయిన తరువాత రోడ్లు బాగుచేసిన తరువాత వసూలుచేయండి అని కొందరు అంటున్నారు ముందు ఆదాయము వస్తే తరువాత యేదైన జరుగుతుంది ఇప్పుడు ఆంధ్రప్రాంతం నుండి ఆదాయము ఎక్కువ వస్తున్నది కాబట్టి అక్కడ రోడ్ల అభివృద్ధి పనులు జరుగుతున్నాయి ఇక్కడ

Excise Revenue, Land Revenue మీద ఎక్కువ ఆదాయం వస్తున్నది కాని తక్కినవాటి మీద ఆంధ్రలో కంటె తక్కువగానే వున్నాయి Hyd rabad కు సంబంధించినంతవరకు Sa'es Tax తక్కువగానే ఉండేది Motor Vehicle Tax తక్కువగానేవుంది ఇంకా Registration Fees అటువంటి లేవని అనుకుంటున్నాను ఈ మాదిరిగా కొన్నికొన్ని తక్కువగానే వున్నాయి ఇవన్నీ ఒకేరంగా చేసుకొనవలసిన అవసరమంతవుంది అందువల్ల యీ బిల్లుకు ఎవరూ ఆక్షేపణ చెప్పనక్కరలేదు Public opinion కూడ అవసరము లేదు అనం Select Committee కి పంపించడానికి అవసరంలేదు ఇందులో కొత్త principle లేదు బెజవాడలో వున్నదానిని సూర్యారావుపేట అనుకొనివస్తున్నాము

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు Select Committee కి పంపడంలో new principle వున్నదనికాదు దీనిలో మీరు చెప్పినవి వారు చెప్పినవి అన్నీ సక్రమముగా ఆలోచించి చర్చించడానికి వీలుగా వుంటుందని చెప్పాను ఇందాక నేను చెప్పినట్లు ఒక్కొక్కచోట ఒక్కొక్క విధముగా పన్నులు వున్నాయి ఒకచోట 30% quarterly tax వుంటే మరొకచోట 55% half yearly tax వుంది ఈ తారతమ్యాలు తీసి వేయడానికి ఒక amendment చేర్చవచ్చును ఈ అవకాశాన్ని ఎందుకు విడిచిపెట్టాలి ?

డాక్టర్ బి గోపాలరెడ్డి అసలు యేమైనా difficulties వుంటే enabling clause వుంటుంది అదేమిలేకపోతే మళ్ళీ సభవద్దకు వస్తాము ఒక్క 6 లక్షల రూపాయల కోసము యింత తర్జనభర్జనలు చేయవలసిన అవసరములేదేమో అనుకుంటాను Select Committee కిపోవడానికి వీలులేదు ఇది ఒక దినములోతేలే విషయముకాదు అందువల్ల యీబిల్లును మీరు వున్నదివున్నట్లుగా pass చేస్తే మేము తప్పకుండా యీ తక్కిన విషయాలను సమగ్రముగా ఆలోచించడానికి ఒక Official Committeeనో, లేక ఒక స్పెషల్ ఆఫీసర్‌నో వేసి సాధ్యమైనంత తొందరలో రెండు ప్రాంతములలోని పన్నులు సమన్వయంచేసుకొనడానికి ప్రయత్నముచేస్తాము

శ్రీ కె యస్ నరసింహారావు రూల్సుచేయడానికి అవకాశములేనప్పుడు ఎవరైనా ఆలోచించి అట్లాంటి బిల్లును Assembly లో తీసుకొని రావడానికి అనుమతియిస్తారా ?

డాక్టర్ బి గోపాలరెడ్డి నేను అటువంటి హామీ యిచ్చేవాడిని కాను

శ్రీ కె యస్ నరసింహారావు మీరు యీ బిల్లు తెచ్చినందువల్ల అదనంగా పన్నుల వర్షం కురుస్తున్నది దీనికి మంత్రిగారి జవాబు యేమిటి ?

డాక్టర్ బి గోపాలరెడ్డి నిజముగా నిన్నటినుంచి వారు చెప్పేది యేమి అర్థముకాలేదు ఇప్పుడు లెక్కచూస్తే 5,440 రూపాయలు యిచ్చేటట్లు యీ Status Quo maintain చేయమంటారా ?

శ్రీ కె యస్ నరసింహారావు పెంచవద్దని నేననలేదు

డాక్టర్ బి గోపాలరెడ్డి నిన్నటినుంచి మీరు పెంచవద్దు, పెంచవద్దు అని అంటూనే వున్నారు

శ్రీ కె యస్ నరసింహారావు మా సెత్తిన యితర పన్నులను రుద్దుతన్నారు ఆ disparities తొలగించినప్పుడు యీ బిల్లు తీసుకొనిరావాలని అంటున్నాను

డాక్టర్ బి గోపాలరెడ్డి వారు యెన్ని పన్నులు నెత్తిన రుద్దుతున్నప్పటికీ 5,400 రూపాయలు కట్టలేరనే నా ఉద్దేశ్యము సంవత్సరానికి బెజవాడలో ఒక్కొక్క బస్ కట్టుతున్న డబ్బు యిక్కడ కట్టడములేదు మీరు ఎన్ని రకముల పన్నులు ఎన్ని కట్టినప్పటికీ 5,400 రూపాయలు రావడంలేదు కాబట్టి ఇందులో అన్యాయం జరుగుతున్నదేమీలేదు డీనివల్ల వారకు ద్రవ్యం వస్తుంది ద్రవ్యము యిచ్చి రోడ్లు బాగుచేయుమని అడగాలి ఇదేమీ వెనుకబడిన ప్రాంతం విషయం కాదు పంచవర్ష ప్రణాళిక కోసము యిది ఉద్దేశింపబడలేదు అందుచేత తప్పకుండా యిది యిప్పుడే pass చేస్తే మంచిది Select Committee కి పంపించవలసిన అవసరములేదు

*Mr Chairman* There are two motions before the House I shall put both of them to vote, together

The question is

"That the Bill be circulated for the purpose of eliciting public opinion"

"That the Bill be referred to a Select Committee"

The motions were negatived

*Sri M Nagi Reddi* I demand division Sir,

The House then divided

Ayes 23 Noes 56.

The motions were negatived

*Mr. Speaker* The question is

"That the Hyderabad Motor Vehicles Taxation (Andhra Pradesh Amendment) Bill, 1957 be taken up for consideration at once"

The motion was adopted

*Clause 2*

*Mr Chairman* There are no amendments to Clause 2

The question is

"That Clause 2 stand part of the Bill"

The motion was adopted

Clause 2 was added to the Bill

*Clause 3*

*Sri Baswa Maniah* I beg to move

"Substitute the following Table for the existing Table 'A'

"*Table 'A'*"

| *Registered Laden Weight* | *Annual Tax* |
|---|---|
| (1) Not exceeding 1,000 lbs | Rs 40 |
| (2) Exceeding 1,000 lbs but not exceeding 4,000 lbs | Rs 50 plus Rs 6 for every additional 500 lbs or part thereof beyond 1,000 lbs |
| (3) Exceeding 4,000 lbs but not exceeding 8,000 lbs | Rs 100 plus Rs 6 for every additional 500 lbs |
| (4) Exceeding 8,000 lbs but not exceeding 18,000 lbs | Rs 150 plus Rs 7 for every additional 500 lbs or part thereof beyond 8,000 lbs |
| (5) Exceeding 18,000 lbs | Rs 400 plus Rs 10 for every additional 500 lbs |

*Mr Chairman* Motion moved

*Sri M Nagi Reddi* I beg to move

"Substitute the following for column No 2 (Annual Tax) in the existing Table A —

(1) Rs 56 and n P 25

(2) Rs 67 and n P 50 plus Rs 11 and n P 25 for every additional 500 lbs or part thereof beyond 1,000 lbs

(3) Rs 140 and n P 62 plus Rs 11 and n P 25 for every additional 500 lbs or part thereof beyond 4,000 lbs

(4) Rs 225 plus Rs 11 and n P 25 for every additional 500 lbs or part thereof, beyond 8,000 lbs

(5) Rs 450 plus Rs 11 and n P 25 for every additional 500 lbs or part thereof beyond 18,000 lbs"

*Mr Chairman* Motion moved

శ్రీ బసవ మానయ్య —ఆంధ్ర ప్రాంతములో ఉన్న సర్‌చార్జి చట్టాన్ని తెలంగాణాలో ఉన్న మోటారు బండ్లకు కూడ వర్తింపచేసే నిమిత్తము యీ బిల్లు తీసుకొనిరాబడింది ఐతే యీనాడున్న పన్ను మూడురెట్లు హెచ్చుచేస్తున్నారు తెలంగాణా ప్రాంతములో సిటీలో 33 స్టేజీ కారియర్సు, 30 కాంట్రాక్టు కారియర్సు, పి డబ్ల్యు డి రోడ్లపై కాక ఇతర రోడ్లపై నడచే 200 బండ్లు ఉన్నవి ఇపుడు విధించబోతున్న సర్‌చార్జి చాలా హెచ్చుగా ఉన్నదనే కారణము చేత తగ్గించుటకు నేను కొన్ని సవరణలిచ్చాను ఆంధ్ర ప్రాంతములోయున్న రహదారులకన్న తెలంగాణా ప్రాంతములోనున్న రహదారులు తక్కువ స్థితిలోయున్నవి తెలంగాణాలో టోలు గేట్లు పన్ను అధికంగా ఉన్నది సంవత్సరానికి 1,500 రూపాయలవరకు చెల్లించుకోవలసి వస్తున్నది అందువలననే యీ బిల్లును ప్రజాభిప్రాయానికి పంపించవలసినదని కోరినాము దానిని మంత్రిగారు అంగీకరించలేదు కనీసము సెలెక్టు కమిటీకైనా పంపించవలెనని యీ బిల్లు యొక్క బాగోగులు రోడ్ల స్థితిగతులు క్షుణ్ణంగా ఆలోచించడానికి వీలవుతుందని చెప్పాను మిత్రులు నాయక్‌గారు యీ విషయము మంత్రిగారికి తెలియజేశారు కాని గ గోపాలరెడ్డి గారు పన్నులు హెచ్చించడమనే మాటతప్ప తగ్గించడమనే మాట నేను వినదలచుకోలేదు అనే ధోరణిలోనే మాట్లాడినారు సౌకర్యములు కావలెనంటే పన్నులు వేయవలసినదే ఐతే యీ పన్నుల భారము వహించవలసినటువంటి ప్రజల యొక్క అభిప్రాయామును గమనించి పరిపాలన కొనసాగించివస్తుతే అది ప్రజాస్వామ్యత్వమునకు అనుగుణముగా ఉంటుంది అన్ని పక్షముల వారు ప్రాతినిధ్యమువహించే సెలెక్టు కమిటీకి యీ బిల్లును పంపి క్షుణ్ణంగా దీనిని చర్చించిఉంటే బాగుండేది ఐతే మా సూచనలకు మంత్రిగారు సుముఖంగాలేరు మూడవ పర్యాయంగా కనీసము మేమిచ్చిన సవరణలనైననూ అంగీకరించవలెనని మంత్రిగారిని కోరుతున్నాను మూడవ క్లాజు క్రింద యీయ బడిన మొదటి పట్టికలోని అంకెలకు బదులు నేను కొన్ని అంకెలు తెలియజేశాను వెయ్యి పౌనులు మించని వాటికి 62 50 రూపాయలకు బదులు 40 రూపాయలని, వెయ్యి

వెయ్యి పౌనులుమించి నాలుగువేల పౌనులక లోపుగలవాటికి 75 రూపాయలనుండి 50 రూపాయలకు తగ్గించమనీ, అంతేకాక ప్రతి 500 ల పౌనులకు వేసె అదనపు చార్జి 12 50 రూపాయలను 6 రూపాయలకు తగ్గించమనీ కోరినాను అదేవిధముగా నాలుగు వేల పౌనులకపైని ఎనిమిది వేల పౌనులకు ఎక్కువ కాకుండా ఉన్నవాటకు 156 రూ ల బదులు 100 రూ లు మాత్రమే పన్ను విధించమని నా ఉద్దేశము అదే రీతిగా 8,000 పౌనులక పైబడి 18 వేల పౌనులు లోబడి 250 రూ లకు బదులు 150 రూ లు మాత్రమే విధించవలెనని సూచించాను 18 వేల పౌనులకు మించిన వాటికి 500రూ లకు బదులు 400 రూ లు మాత్రమే సర్‌చార్జి వేయుడవం బాగుంటుంద ప్రభుత్వము వారు వేయదలచుకున్న రేట్లకు నేను సూచించిన పెత్తాలకు పెద్ద తేడాలేదు అందువల్ల యీ సవరణను అంగీకరించమని కోరుచున్నాను ఒక్క పర్యాయ మే ఇంత హెచ్చురేటు విధించేకన్నా ప్రజల కష్ట సుఖాలను గమనించి కొంచెం కొంచెంగా వేస్తూ పోతే బాగుంటుంది

శ్రీ యం నాగిరెడ్డి —అధ్యక్షా, ఈ బిల్లులోని ఎన్నో విషయాలపైన పలువురు సభ్యులు ఉపన్యసించారు ఈ బిల్లును ప్రజాభిప్రాయానికి పంపించవలెననీ సెలెక్టు కమిటీకి పంపవలెననీ నేనిచ్చిన సవరణలను ప్రభుత్వం అంగీకరించలేదు కాంగ్రెసు పార్టీ సభ్యులు మా అభిప్రాయములతో ఏకీభవించినప్పటికీ వారు ఒకా శా పే డేట్ ఉన్న కారణంవల్ల ననుకంటాను వ్యతిరేకంగా వోటుచేస్తున్నారు సంఖ్యాబలము లేనందున మా సవరణలు వీగిపోయాయి మిత్రులు బసవమానయ్యగారు ఇచ్చిన సవరణ ప్రకారము పన్నురేట్లు చాలావరకు తగ్గించవలసియుంది వారి సవరణను మంత్రిగారు అంగీకరిస్తే మంచిదే ఇప్పుడున్న పన్నులనుకూడ తగ్గించేటిగా శ్రీ బసవమానయ్యగారి సవరణలు ఉన్నాయి ఏ కారణమువల్లనైనా ప్రభుత్వమువారు ఆ సవరణలను అంగీకరించలేక పోయినట్లయితే నేనిచ్చిన సవరణలను అంగీకరించమని కోరుతున్నాను ప్రభుత్వమువారి సూచనల ప్రకారము నూటికి 25 వంతులు సర్‌చార్జి విధించడము జరుగుతున్నది ఈ 25 వంతులు సర్‌చార్జిని సగమునకు తగ్గించవలెనని సవరణల ముఖ్యోద్దేశము ఇదివరకున్న 50 రూపాయల పన్నును ఇపుడు 62½ రూపాయలు చేయవలెనని ప్రభుత్వమువారు అంటే దానిని 56 25 రూపాయలు మాత్రమే చేయవలెనని నా సవరణ ఆదేవిధముగా 60 రూపాయలు ఉన్నచోట 67 50 రూపాయలు విధించాలని నేనంటున్నాను ప్రభుత్వమువారు సూచించిన 25 శాతవం సర్‌చార్జిని సగమునకు తగ్గించాలనేది నా సవరణలోని ముఖ్యోద్దేశము 125 రూపాయలున్న దానిని 142 రూపాయల 62 నయాపైసలకు, 200 రూ లు ఉన్నదానిని 225 రూ లకు పెంచమని నేను సవరణలు ఇచ్చాను అదనముగాయున్న ప్రతి 500 పౌనులకు 11 25 రూపాయలు మాత్రమే విధించాలని నా సవరణలో వివరించాను సాధారణంగా 8 వేల్ల పౌనులు మోసే లారీలు ఉన్నవి ఇదివరకు రూ 200 లు పన్ను ఉంటే యిప్పుడు 225 రూ ల వరకు పెంచుటకు సవరణ యిచ్చాము ఇది మంత్రిగారు అంగీకరించవలసిన విషయం

[*Mr Speaker in the Chair*]

డాక్టర్ బి గోపాలరెడ్డి —25% బదులు 12½% అనా?

శ్రీ యమ్ నాగిరెడ్డి —అవును 12½ అని చెపితే అది కొద్ది మొత్తమే అంటారు, అధికాదు. రు 200 లను రు 225 లు చేస్తున్నాము పెంచినది రు 25లు

అని చూడండి 8,000 పౌనులు తరువాత అదనంగా పెరిగేదానికి ప్రతి 500 పౌనులకు రూ 11–4–0 అని సవరణ యిచ్చాము పాతయాక్టు (టేబిల్) లో ఒకలోటు ఉన్నది వెయ్యి లోపలదానికి రు 50 లు అని స్టార్ట్ చేశారు వెయ్యి పౌనులదాటి 4 వేల పౌనులవరకు రు 60 లతో start చేశారు 11 వందల పౌనుల లారీ అయితే మొదటి ఐటెము ప్రకారం రు 50 లు యిదివరకే ఉంటే దానిమీద రు 10 లు పెరగాలి, అంటే రు 60 లు రావాలి 1,000 దాటి 1,100 లలో పడితే రూ 50 ల మీద రు 10 లు అగా రు 60 లతో start చేసి మళ్ళీ 100 పౌనులుపైన హెచ్చుఉన్నది కాబట్టి 75 రూపాయిలు ఇవ్వాలన్నారు ఇదివరకు బిల్లులోనే అది ఎందుకు పెట్టారో తెలియదు Table B క్రింద అలాంటి పేచీలేదు Table A లోనే పౌనులు పెంగినకొద్దీ proportion మించి పన్ను వేయుట స్పష్టంగా కనబడుతున్నది దానికి సవరణ పెతేట్టి మంత్రిగారు—25% పెంచారనేగాని, వాస్తవంగా ఆ తేడాను దృష్టిలోకి తీసుకొనలేదు అందువల్ల 1,000 నుంచి పెరిగిన తరువాత 1,001 అయినా 12½ పెరగటమే కాకుండా 75 పెరుగుతుంది 62½ ఉన్నది, ఒక్క పౌను పెరగగానే 87 అయ్యే ప్రమాదం ఉన్నది పైకిపోయిన కొద్దీ ఆ తేడావస్తున్నది మొట్టమొదట బిల్లు తయారుచేసినప్పుడు యిది ఎలా start చేశారో తెలియదు సాధారణంగా 8 వేలు, 10 వేల పౌనులు మోసే లారీలు ఉంటాయి ఈ 4 వ ఐటెమ్ క్రింద సాధారణంగా యీ లారీలు వస్తాయి వాటిని తీసుకుంటే 250 తో start అవటమే ఎక్కువ అవుతోంది కాబట్టి ప్రభుత్వంవేసిన ఎక్కువ పన్ను దృష్టిలో పెట్టుకొని, దానిని నూటికి రు 12½ చొ॥ పెంచుటకు అంగీకరించాలని కోరుతున్నాను ఈ నాల్గవ ఐటెమ్ లో ప్రతీ 850 పౌనులకని ఉన్నది అది ప్రింటింగ్ మిస్టేకేమో అది 500 పౌనులు అనుకుంటాను ఈ పన్నుల గురించి ప్రతిపక్షమే విమర్శిస్తుందని అనుకోనక్కరలేదు ప్రభుత్వపక్షం వారుకూడా విమర్శించారు వారు చేసిన విమర్శనలుకూడ దృష్టిలో పెట్టుకొని యీ 12½% పెంచాలనే సవరణ అంగీకరించాలని కోరుతున్నాను

డాక్టర్ బి గోపాలరెడ్డి —ఇప్పుడు ఉన్నదానికి 25% ఎక్కువ చేయాలని ప్రభుత్వ ప్రతిపాదన కాని వారు 12½% మాత్రమే చేయమని కోరుతున్నారు

శ్రీ యమ్ నాగిరెడ్డి —చాలా దగ్గరకు వచ్చాము కాబట్టి అంగీకరించాలని కోరుతున్నాను

డాక్టర్ బి గోపాలరెడ్డి —అందుకనే మేము ప్రతిపాదించినదానినే ఉంచండి

*Mr Speaker* I will first put the amendment of Sri Basawa Maniah to the vote of the House

"The question is

"Substitute the following Table for the existing Table 'A' —

TABLE 'A'

| *Registered Laden Weight* | *Annual Tax* |
|---|---|
| (1) Not exceeding 1,000 lbs | Rs 40 |
| (2) Exceeding 1,000 lbs but not exceeding 4,000 lbs | Rs 50 plus Rs 6 for every additional 500 lbs or part thereof beyond 1,000 lbs |
| (3) Exceeding 4,000 lbs but not exceeding 8 000 lbs | Rs 100 plus Rs 6 for every additional 500 lbs |
| (4) Exceeding 8,000 lbs but not exceeding 18,000 lbs | Rs 150 plus Rs 7 for every additional 500 lbs or part thereof, beyond 8,000 lbs |
| (5) Exceeding 18,000 lbs | Rs 400 plus Rs 10 for every additional 500 lbs |

The motion was negatived

*Mr Speaker* I will now put the amendment of Sri M Nagi Reddi to the vote of the House

The question is

"Substitute the following for column No 2 (Annual Tax) in the existing Table 'A'

(1) Rs 56 and n P 25

(2) Rs 67 and n P 50 plus Rs 11 and N P 25 for every additional 500 lbs or part thereof beyond 1,000 lbs

(3) Rs 140 and n P 62 plus Rs 11 and N P 25 for every additional 500 lbs or part thereof beyond 4,000 lbs

(4) Rs 225 plus Rs 11 and n P 25 for every additional 500 lbs or part thereof, beyond 8,000 lbs

(5) Rs 450 plus Rs 11 and n P 25 for every additional 500 lbs or part thereof beyond 18,000 lbs"

The motion was negatived

*Sri Baswa Maniah* Mr Speaker, Sir, I beg to move

TABLE 'B'

"Substitute the following for column No 2 (Annual Tax), in Table 'B —

| | |
|---|---|
| (1) 4 Persons | Rs 50 |
| (2) Exceeding 4 persons but not exceeding 6 persons | Rs 60 plus Re 1 for every additional person beyond 4 |
| (3) Exceeding 6 perons but not exceeding 8 persons | (*a*) Rs 150 plus Rs 20 for every additional person beyond 6 in the case of stage carriages used on the P W D roads |
| | (*b*) Rs 95 plus Rs 15 for every additional person beyond 6 in the case of stage carriages used on other roads |
| (4) Exceeding 8 persons but not exceeding 26 persons | (*a*) Rs 200 plus Rs 20 for every additional person beyond 8 in the case of stage carriages used on P W D roads |
| | (*b*) Rs 120 plus Rs 10 for every additional person bevond 8 in the case of stage carriages used on other roads |
| (5) Exceeding 26 persons but not exceeding 32 persons | (*a*) Rs 450 plus Rs 20 for every additional person beyond 26 in the case of stage carriages used on P W D roads |
| | (*b*) Rs 400 plus Rs 10 for every additional person beyond 26 in the case of stage carriages used on other roads |
| (6) Exceeding 32 persons | (*a*) Rs 900 plus Rs 25 for everv additional person beyond 32 in the case of stage carriages used on the P W D roads |
| | (*b*) Rs 500 plus Rs. 20 for every additional person beyond 32 in the case of stage carriages used on other roads ' |

*Mr Speaker* Motion moved

శ్రీ బసవ మానయ్యా అధ్యక్షా! ఈ 'బి' టేబిల్‌లో లోగడ తెలంగాణా ప్రాంతంలో motor vehicles కు ఉన్న టాక్సు యిప్పుడు ఎక్కువ చేయబడినది అది అంత ఎక్కువ లేకుండా మధ్యస్తంగా ఉండేటట్లు చేయటానికి యీ అమెండుమెంట్సు ప్రతిపాదిసున్నాను మొదటి ఐటెమ్ం రూ 80 లు అనేదానికి రు 50 లు ఉండాలని,

(2) నలుగురికి మించి 6 గురు persons వరకు రూ 80 లకు బదులు రు 60లు ఉండాలని, ప్రతి అదనపు వ్యక్తికి రూ 3 34 న పైసలకు బదులు రూ 1 ఉండాలని,

(3) 6 గురికి మించి 8 మందివరకు P W D రోడ్లపై నడిపే స్టేజి కారేజెస్‌కు రు 225 లకు బదులు రు 150 లు, ప్రతి అదనపు వ్యక్తికి, 6 గురికి మించితే రు 36 లు, బదులు రు 20లు, తదితర రోడ్లపై నడపబడే స్టేజి కేరేజీల విషయంలో రు 150లకు బదులు రు 95 లు, 6 గురికి మించిన ప్రతి వ్యక్తికి రు 24క బదులు రు 15 లు

(4) 8 మంది నుంచి 26 గురు వరకు P W D రోడ్లపై నడపబడే స్టేజి కారేజెస్‌లో రు 300 లకు బదులు రు 200, రు 36 లు బదులు రు 20 లు, తదితర రోడ్లపై నడపబడే స్టేజి కారేజీల విషయమై రు 200 లు బదులు రు 120 లు, 8 మందికి మించినచో రు 24 కు బదులు రు 10

(5) 26 మందికి మించి 32 వరకు రు 960 కు బదులు రు 450, రు 36లు బదులు రూ 20 లు తదితర రోడ్లపై రు 640 బదులు రు 400, రు 24 బదులు రు 10

(6) 32 మందికి మించినచో రు 1,200 బదులు రు 900 సవరణ ప్రతిపాదించినాను ఇందులో రు 300 లు మాత్రమే తేడా ఉన్నది

శ్రీ గోపాలరెడ్డిగారికి పన్నుల హెచ్చించుట ప్రియం, స తోపం వారు చెప్పినదానిలో రు 300లు తగ్గించి దగ్గర దగ్గరగా తీసుకువస్తే ఒప్పుకుంటారని రు 900లు నేను ప్రతిపాదిస్తున్నాను కనీసం ఈ ప్రతిపాదనతోనైనా ప్రతిపక్షంతో సహకరించటానికి వారు సిద్ధంగా ఉన్నారేమో చూడటానికి గట్టిగా ప్రయత్నం చేయబడ్డది

రు 36 లకు బదులు, రు 25లు, తదితర రోడ్లపై రు 800 లకు బదులు రు 500 లు ఈ రీతిగా కొంచెం మార్పుతో నేను సవరణలు యిచ్చాను ఇందులో ఎక్కువ భేదములేదు కనుక చాలా నష్టమవుతుందనేదిలేదు ప్రభుత్వం ప్రతిపాదించిన దానిలో చాలా ఎక్కువగా పెంచబడినది నూటికి 300లు హెచ్చించాలనే పరిస్థితిలో నూటికి 200 వరకు అనగా రెండు రెట్లు ముందుకువచ్చి మేము చేసిన సూచనలతో సహకరిస్తారని ప్రతిపక్షంనుంచి ప్రయత్నం చేయబడింది ప్రజాభిప్రాయానికిగాని, సెలెక్టు కమిటీకి పంపుటకుగాని ఒప్పుకొనకపోయినా నేను కోరిన 900ల వరకైనా ఒప్పుకుంటారని ప్రార్థిస్తూ ఈ సవరణలు ప్రతిపాదిస్తున్నాను

డాక్టర్ బి గోపాలరెడ్డి ఒప్పుకొనుటలేదు

*Mr Speaker* The question is

TABLE 'B'

"Substitute the following for column No 2 (Annual Tax), in Table 'B' —

| | |
|---|---|
| (1) 4 Persons | Rs 50 |
| (2) Exceeding 4 persons but not exceeding 6 persons | Rs 60 plus Re 1 for every additional person beyond 4 |

| | |
|---|---|
| (3) Exceeding 6 persons but not exceeding 8 persons | (a) Rs 150 plus Rs 20 for every additional person beyond 6 in the case of stage carriages used on the P W D roads |
| | (b) Rs 95 plus Rs 15 for every additional person beyond 6 in the case of stage carriages used on other roads |
| (4) Exceeding 8 persons but not exceeding 26 persons | (a) Rs 200 plus Rs 20 for every additional person beyond 8 in the case of stage carriages used on P W D roads |
| | (b) Rs 120 plus Rs 10 for every additional person beyond 8 in the case of stage carriages used on other roads |
| (5) Exceeding 26 persons but not exceeding 32 persons | (a) Rs 450 plus Rs 20 for every additional person beyond 26 in the case of stage carriages used on P W D roads |
| | (b) Rs 400 plus Rs 10 for every additional person beyond 26 in the case of stage carriages used on other roads |
| (6) Exceeding 32 persons | (a) Rs 900 plus Rs 25 for every additional person beyond 32 in the case of stage carriages used on the P W D roads |
| | (b) Rs 500 plus Rs 20 for every additional person beyond 32 in the case of stage carriages used on other roads " |

The motion was negatived

*Sri Pillalamarri Venkateswarlu* Mr Speaker, Sir, I beg to move

TABLE 'B'

Substitute the following for column No 2 (Annual Tax), in Table 'B' —

| | |
|---|---|
| (1) 4 Persons | Rs 57 |
| (2) Exceeding 4 persons but not exceeding 6 persons | Rs 75 |
| (3) Exceeding 6 perons but not exceeding 8 persons | (a) Rs 93 57 plus Rs 15 for every additional person beyond 8 in the case of stage carriages used on the P W D roads |
| | (b) Delete |

| | |
|---|---|
| (4) Exceeding 8 persons but not exceeding 26 persons | (*a*) Rs 125 plus Rs 10 for every additional person beyond 8 in the case of stage carriages used on P W D roads |
| | (*b*) Rs 100 plus Rs 12 for every additional person beyond 8 in the case of stage carriages used on other roads |
| (5) Exceeding 26 persons but not exceeding 32 persons | (*a*) Rs 400 plus Rs 15 for every additional person beyond 26 in the case of stage carriages used on P W D roads |
| | (*b*) Rs 380 plus Rs 15 for every additional person beyond 26 in the case of stage carriages used on other roads |
| (6) Exceeding 32 persons | (*a*) Rs 500 plus Rs 15 for every additional person beyond 32 in the case of stage carriages used on the P W D roads |
| | (*b*) Rs 475 plus Rs 15 for every additional person beyond 32 in the case of stage carriages used on other roads ' |

*Mr Speaker* Motin Moved

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు అసలు ఇదివరకే Table "B"లో 4 గురు వ్యక్తులు కూర్చుండేటటువంటి చిన్నచిన్న కార్లకు, టాక్సీలకు 60 రు టాక్స్ అని ఉన్నది దానిని ఇప్పుడు ప్రభుత్వంవారు 33⅓% పెంచి, 80 రు టాక్స్ చేశారు నేను నా సవరణ ద్వారా 75 రు ఉంటే సరిపోతుందని సూచించాను లారీన్ యజమానులపైన, ఇంతకన్నా బాగా ఉన్నవారిపైన 25% మాత్రం పెంచి, చిన్నచిన్నవాళ్లపైన, స్వంతంగా డ్రైవ్ చేసుకొని వాటిమీదే జీవించే వారిపైన 33⅓% పెంచటం బాగా లేదని నా అభిప్రాయము ప్రభుత్వము ఒకే సూత్రమును అవలంబించి అన్నిటిపైన ఒకే పర్సంటేజి చొప్పున పన్ను పెంచాలి ప్రభుత్వానికి ఒక సూత్రంగా ఉంటుందనే ఉద్దేశంతో నేను 25% మాత్రమే అన్నింటి మీద పెంచాలని సూచిస్తున్నాను మొత్తంగా అన్నింటిపైనా ఒకే సూత్రం ప్రకారంగా, 25% యావరేజిన పెంచితే సరిపోతుందని నా ఉద్దేశ్యం అంతేగాని ఒకదానిపై 50%, మరొకదానిపై 33⅓%, ఇంకొకదానిపై 25%, 75%, 200% చొప్పున యీ విధముగా పెంచటం సరిగాలేదనే దృష్టితో యీ అమెండ్‌మెంటు నేను సూచించాను 4 గురు వ్యక్తులు కూర్చునేటటువంటి చిన్నకార్లకు, ప్రభుత్వంవారు చెప్పినదానికన్నా 5 రు తక్కువగా నేను సూచించాను 80 రు కాకుండా 75 రు ఉంటే సరిపోతుందని నేను సూచించాను నలుగురు మొదలుకొని ఆరుగురువరకు కూర్చొనుటకు వీలైన బస్సుకు టాక్సు 60 రు ఉండి, ప్రతి ఒక్క ఎడిషనల్ సీటుకు ఒక రూపాయి అదనంగా ఉంటే సరిపోతుందని నేను సూచించాను దానికి, గోపాలరెడ్డిగారు 80 రు ఉండాలని, ప్రతి

అదనపు సీటుకు 3 రు చొప్పున ఉండాలని సూచించారు నేను ప్రధానంగా ఒకే సూత్రము సూచిస్తున్నాను ప్రభుత్వము దానిని గురించి ఆలోచించి, దానిని ఒప్పుకుంటే సరిపోతుంది యావరేజన 25% ప్రతిదానిపైన ఎక్కువచేస్తే సరిపోతుందని నా అభిప్రాయము 3 (ఎ)లో 93 రూ ల 75 నయాపైసలు ఉండాలని ప్రతి ఎడిషనల్ సీటుకు 15 రు అదనంగా ఉంటే సరిపోతుందని నేను భావించాను తర్వాత, (3) (B)ని delete చేయమనికోరాము గతంలో తెలంగాణాలో "Rs 75 + Rs 10 for every additional person beyond 6" అని ఉన్నది ఇప్పుడు గోపాలరెడ్డిగారు సూచించిన ప్రకారంగా అప్పుడులేదు లందువల్ల 3 (బి) అవసరంలేకుండా ఉంటె సరిపోతుందని, కాబట్టి 3 (బి)ని delete చేయాలని సూచిస్తున్నాను

8 పెండలు కాని 26 పాసింజర్స్‌ను ఎక్కించుకొనే కారుకు పూర్వం తెలంగాణాలో 100 రు ఉండి, ప్రతి additional seat కు 12 రు చొప్పున వసూలు చేయాలని ఉన్నది నేను 25% పెంచాలని సూచించాను అంటే 125 రుల వరకు పెంచి, ఎడిషనల్ సీటుకు 12 రు బదులు 15 రూలకు పెంచితే సరిపోతుందని సూచించాను

4 (బి) రూ 100 + రూ 12 అని, 5(ఎ) రూ 400 + రూ 15 అని, 5(బి) రూ 380 + రూ 15 అని, 6(ఎ) రూ 500 + రూ 15 అని, 6(బి) రూ 475 + రూ 15 అని నేను సూచించాను వీటిలో ప్రధానమైన విషయం ఒక్కటే ఉన్నది అన్నింటికి యావరేజి 25% చొప్పున పెంచితే సరిపోతుంది లారీస్ పైన ఎంత పెంచామో, మిగతావాటిపైన అంతే పెంచాలి చిన్నచిన్నకార్లపైన, మోటార్ సైకిల్స్‌పైన ఎక్కువ పర్సంటేజ్ చొప్పున పెంచటం న్యాయంగా ఉండదని నేను మనవిచేస్తున్నాను అందుచేత అన్నింటిపైన 25% చొ॥న పెంచుతూ మేము యీ సవరణ ప్రతిపాదించాము మనకు అందజేసిన ఎజండా చూస్తే ఇంకొక విషయం కూడా బోధపడుతుంది త్వరలోనే మన ముందుకు మోటార్ స్పిరిట్ టాక్సేషన్ బిల్లు రాబోతోంది మోటార్ స్పిరిట్ మీద కూడా అదనంగా పన్ను వేయబోతున్నాము చిన్నచిన్న తుక్కుకార్లను టాక్సీలు క్రిందపెట్టుకొనిన నడుపుకొంటూ అనేకమంది జీవిస్తున్నారు ఈ బిల్లులవల్ల అదనంగా వారిమీద పన్ను పడుతుంది స్వంతంగా పెద్దపెద్ద కార్లు ఉన్నవారి మీద కాదు, యీ పన్ను పడుతున్నది ప్రధానంగా టాక్సీలు నడుపుకొంటున్నవారిమీద యీ పన్ను పడుతోందన్న విషయం అందరూ గుర్తుంచుకోవాలి అసలు Tax పెంచటమే పొరపాటు పైగా లారీస్‌కన్నా ఎక్కువగా, 33⅓% చిన్నచిన్నవాటిపైన పెంచటం ఇంకా పొరపాటు అవుతుంది కనుక నేను చెప్పినట్లుగా అన్నింటిపైన 25% చొ॥న పెంచాలన్న దానిని అంగీకరించాలని కోరుతున్నాను

డాక్టర్ బి గోపాలరెడ్డి వారి సవరణ నేను ఒప్పుకోవటంలేదు

*Mr Speaker* The question is

"Substitute the following for column No 2 (Annual Tax), in Table 'B':—

TABLE 'B'

| | |
|---|---|
| (1) 4 Persons | Rs. 75 |

| | |
|---|---|
| (2) Exceeding 4 persons but not exceeding 6 persons | Rs 75 |
| (3) Exceeding 6 perons but not exceeding 8 persons | (a) Rs 93 75 plus Rs 15 for every additional person beyond 8 in the case of stage carriages used on the P W D roads<br>Deleted |
| (4) Exceeding 8 persons but not exceeding 26 persons | (a) Rs 125 plus Rs 15 for everv additional person beyond 8 in the case of stage carriages used on P W D roads<br>(b) Rs 100 plus Rs 12 for every additional person beyond 8 in the case stage carriages used on other roads |
| (5) Exceeding 26 persons but not exceeding 32 persons | (a) Rs 400 plus Rs 15 for every additional person beyond 26 in the case of stage carriages used on P W D roads<br>(b) Rs 380 plus Rs 15 for every additional person beyond 26 in the case of stage carriages used on other roads |
| 6) Exceeding 32 persons | (a) Rs 500 plus Rs 15 for every additional person beyond 32 in the case of stage carriages used on the P W D roads<br>(b) Rs 475 plus Rs 15 for every additional person beyond 32 in the case of stage carriages used on other roads " |

The motion was negatived

*Sri Pillalamarri Venkateswarlu* I demand a division, Sir

The House then divided

Ayes 15, Noes 48

The motion was negatived

*Sri M. Nagi Reddi* I beg to move,

" For the existing column No 2 (Annual Tax) in Table B, substitute the following

ANNUAL TAX

| | |
|---|---|
| Item 1 | No change |
| 2 | No change |
| 3 (*a*) | Rs 150 plus Rs 24 for every additional person beyond 6 in the case of stage carriages used on the P W D roads |
| 3 (*b*) | Delete completely |
| 4 (*a*) | Rs 400 plus Rs 24 for every additional person beyond 8 in the case of stage carriages used on P W D roads |
| 4 (*b*) | Delete completely ' |
| 5 (*a*) | Rs 640 plus Rs 24 for every additional person beyond 26 in the case of stage carriages used on P W D roads |
| 5 (*b*) | Delete completely |
| 6 (*a*) | Rs 800 plus Rs 24 for every additional person beyond 32 in the case of stage carriages used on the P W D roads |
| 6 (*b*) | Delete completely |

*Mr Speaker* Motion moved

శ్రీ యమ్ నాగిరెడ్డి అధ్యక్షా, ఇప్పుడు ఈ Table–B లో ఉన్న ఒకటి, రెండు అయిటముల మీద సవరణ లేకుండ, తక్కిన అయిటములకు సవరణలు ఇవ్వడము జరిగింది 3, 4, 5, 6 అయిటముల విషయములో ఇదివరకు ఉన్న పన్నులు రెట్టింపు అయ్యేటట్లుగా సవరణ ఇచ్చాము అంటే మూడవ అయిటము క్రింద ఉన్న 75 రూపాయలు 150 రూపాయలుగను, నాల్గవ అయిటము క్రిందఉన్న 100 రూపాయలను 200 రూపాయలుగను, ఆయిదవ అయిటము క్రిందఉన్న 320 రూపాయలను 640 రూపాయలుగను ఆరవ అయిటము క్రింద ఉన్న 400 రూపాయలను 800 రూపాయలుగ చేయడమునకును అదేవిధముగ అదనముగ ఉండే ప్రతి మనిషికినీ అదివరకు ఉన్న దానికి రెట్టింపుగా కూడా ఉండే టట్లును సవరణలు ఇచ్చాము ఆ విధముగచేస్తే ఇప్పుడు మనముందు ఉన్న బిల్లులో ఇచ్చినవాటికి సరిపోతుందని

మంత్రిగారి దృష్టికి తెస్తున్నాను 3, 4, 5 అయిటములను ఒక్కొక్కటి రెండు భాగములుగ చేసి PWD రోడ్లు ఉపయోగించే వాటికి మూడు రెట్లనీ, PWD రోడ్లు కానటువంటివి, బిల్లులో define చేయనటువంటి, Other roads అయితే రెండు రెట్లు అనిన్నీ, మంత్రిగారు యీ బిల్లు ద్వారా సూచించి యున్నారు PWD Roads కానటువంటి వాటిని other roads అని మంత్రిగారే అంగీకరించారు PWD, రోడ్లు కానటువంటి వాటికి ప్రభుత్వము repairs గాని, ఇతర వసతులుగాని చేయుటము లేదని, వాటిక్రింద Depreciation Fund చాలా తక్కువగ ఉంటుందని మంత్రిగారు అంగీకరించారు ఈ other roads అనేవి సాధారణముగ డొంకదారులుగ ఉంటాయి గనుక వాటిమీద ఏమాత్రము పన్ను పెంచకుండ, ఒక్క PWD roads pucca roads గా ఉంటాయి గనుక, వాటి మీద యిదివరకున్న దానికి రెట్టింపు వేయుమని మా సవరణ యొక్క సారాంశము మొదట రెండు మూడు అయిటముల విషయములో మాత్రము ఇదివరకు ఉండే [illegible] హెచ్చు చేశారు వాటిని మాత్రము అంగీకరించి మిగత అయిటముల విషయములో మూడు రెట్లు చేసేబదులు రెండు రెట్లుగ చేయుటానికి మంత్రిగారిని ఆలోచించమని కోరుతున్నాను ఒకదానితో రెండు భాగములుగచేసి, ఒక్కొక్కదానిని రెండు రెట్లుగ చేయటానికి మంత్రిగారు అంగీకరించి బిల్లులో పెట్టారు కాబట్టి దానికి సంబంధించి కాని PWD రోడ్లమీద, అంటే ప్రభుత్వము వసతులు కలిగించే రోడ్లగనుక, వాటిమీదనడచే బస్సులకు మాత్రమే ఆ రెండు రెట్లు చేయండి అని అంటున్నాను ప్రభుత్వము ఏ మాత్రము రిపేర్లుగాని, యితర వసతులుకాని చేయకుండా, ఒక్కదమ్మిడీయైనా ఖర్చు చేయనటువంటి రోడ్లు, చాలావరకు డొంకదార్లుగా ఉన్నవి వర్షాకాలములో గండ్లుపడడమువల్ల బస్సులు ఆగిపోవటము జరుగుతున్నది ఆ గండ్లు అన్నీ ఆ bus owners డ్రైవర్లు, కండక్టర్లు, తమస్వంత ఖర్చులతో బాగు చేసుకుని నడుపుకుంటూ ఉంటారు అటువంటి రోడ్లమీద నడిచేవాటికి గూడ రెండు రెట్లో మూడు రెట్లో అదనపు పన్ను వేస్తామనడము సబబుగాదు వాళ్లు స్వంతఖర్చు పెట్టుకొని రిపేర్లు చేసుకుని నడుపుకునేవి డొంకరోడ్లు కచ్చారోడ్లుగా ఉన్నవి అటువంటి వాటి మీద నడిచేవాటికి అదనపు పన్ను వేయడము న్యాయమేనా అని అడుగుతున్నాను ఈ విషయం మంత్రిగారు ఆలోచించతగ్గ విషయము ప్రభుత్వానికి డబ్బు అవసరమని అంటున్నారుగనుక ఇప్పుడు నేనుచేసిన సవరణను అంగీకరించినప్పటికినీ, దానిద్వారా కూడా డబ్బువచ్చేదేగనుక ఆ సవరణను అంగీకరించమని కోరుతున్నాను ఇప్పుడు ప్రభుత్వము పన్ను హెచ్చింపుచేసే విషయంలో మరొకసంగతికూడ గమనించవలసియున్నది బిల్లులో other roads అని ఇచ్చారు వాటికి బిల్లులో definition కూడ ఉన్నది వీటి విషయములో, కూడ సవరణలు యిచ్చాము ఏ కొద్దిదూరమో PWD roads గా ఉండి తక్కిన రోడ్డు ఆ Other roads గా ఉండి, వాటిమీద బస్సులు నడిచేటట్లయితే, ఆ ప్రయాణమునంతను PWD roads మీదనే ప్రయాణము చేసినట్లుగ పరిగణిస్తామని ప్రభుత్వము యొక్క సూచన ఆ విధముగ ప్రయాణముచేసిన బస్సులకు P.W D roads కు వేసే హెచ్చింపు పన్ను విధిస్తామని అంటున్నారు. ఈ other roads అనే వాటిమీద ఇప్పుడు ప్రభుత్వం ఏరకంగా రెండు రెట్లు వేసిందో అలాగే P.W.D. roads కానటువంటి రోడ్లమీదనడిచే వాటికి వెనుక ఉన్న పన్నును అట్లాగే ఉంచమని

పేయము నేను సవరణ ద్వారా కోరుతున్నాను. ఇదికూడ చాలా సబబైన సవరణ కనీసము యీ సవరణ అయినా, ఏదో ప్రతి పక్షమువారు యిచ్చారని నిరాకరించక, ఇదికూడ ఏదో కొంత ఆలోచించతగ్గ విషయమేనని భావించి, అంగీకరిస్తారని ఆశిస్తున్నాను

డాక్టర్ బి గోపాలరెడ్డి అధ్యక్షా, ఈ పన్నుల మార్పు విషయములో శ్రీ నాగిరెడ్డి గారు రెండు విషయములు చెప్పారు మొదటిది P W D Roads ను గురించి, రెండవది P W D Roads కానటువంటివి, కచ్చారోడ్లను గురించి ఇందులో P W D Roads మీద నడిచే బస్సులు నూటికి తొంభై పాళ్లు R T D బస్సులే అలాంటి రోడ్లమీదనడిచే బస్సుల మీద మూడు రెట్లు వేస్తామని ప్రభుత్వము యొక్క సూచన కాని నాగిరెడ్డిగారు దానిని రెండింతలు చెయ్యమని అంటున్నారు ఈ విషయములో వారు చాలా దీర్ఘంగా ఉపన్యాసము చేశారు కారణము ఏమిటో తెలియడము లేదు అయినను ఈ అదనపు పన్ను మాత్రము బస్సులో ప్రయాణముచేయు passengers మీద మాత్రము పడేటట్లు చేయడము లేదు వారు యిచ్చే tares ను అధికము చేయడము లేదు R T D వారు యిచ్చేసొమ్ము దొరకనే Book Adjustment కొరకు Account Books లో వ్రాస్తారు ఇప్పుడు నాలుగు వందలఉన్న దానిని మూడు రెట్లు అంటే 1,200 రూపాయలు ఇస్తున్నట్లుగా Account Books లో వ్రాయడమే జరుగుతుంది ఇలాంటిదానికి ఇంత దీర్ఘోపన్యాసము చేయడము ఎందువల్లనో అర్థము కావడము లేదు రెండవది కచ్చారోడ్ల విషయము వీటిమీద నడచేవాటిపై ఏ మాత్రము అదనపు పన్ను వేయ వద్దని అంటున్నారు వెంకటేశ్వర్లుగారుకూడ ఒక మైలో, రెండు మైళ్లో, ఏకొద్ది దూరమో P W D రోడ్డుగా ఉండి, తక్కినది అంతా కచ్చారోడ్డుగా ఉంటే, ఆ ప్రయాణమంతా P W D రోడ్డుమీద చేసినట్లు పరిగణించవద్దు అని అంటున్నారు ప్రభుత్వము రూల్సు ప్రకారము అలాంటి దానికి మూడింతలు పన్ను పడుతున్నది కాని యీ విషయములో మాత్రము నేను ఒక హామీ యిస్తున్నాను ఏమిటంటే, అయిదు మైళ్లకు ఎక్కువ కాకుండా P W D రోడ్డుమీద నడిచినట్లయితే, తక్కిన ప్రయాణము అంతా కచ్చారోడ్డు మీదపోతే, అలాంటి వాటికి పన్ను రెండింతలే పడుతుంది కాని మూడింతలుపడదు అందుకు యిచ్చిన సవరణను మాత్రము నేను అంగీకరించటానికి సిద్ధముగ ఉన్నాను

శ్రీ యమ్ నాగిరెడ్డి దీనికి సంబంధించిన సవరణ ఇందులోనే ఉన్నదండి అది ఏమనిఅంటే "సగానికిమించి P W D రోడ్డుగా ఉంటే, దానికి P W D రోడ్డు పన్ను తీసుకొండి అంతకు తక్కువగ other road గా ఉంటే అది other road అయినటువంటి క్రిందకు తీసుకోండి" అని అంటున్నాము ఇది చాలా న్యాయమైన సవరణ సగానికి లోపల ఉన్నప్పటికినీ, అది సగానికి మించినట్లు వేయడమేనన్నమాట

**"Where a stage carriage is used on a route lying partly on a P W D Road and partly on any other road such stage carriage shall be deemed to be used wholly on the P W D road or any other road whichever is more than half of the length of the road",** అని సవరణ పెట్టాము.

అందువల్ల ఏ రోడ్డు ఎక్కువఅయితే దానిని తీసుకోమని అంటున్నాము ఇప్పుడు ఉదహారణ చెబుతున్నాను అసలు రూటులంతా ఎ యాభై మైళ్లో, ఇరవై మైళ్లో రోడ్డు ఉండి, అందులో ఎ అయిదు మైళ్లో, ఆరు మైళ్లో PWD Road గా ఉంటే, ఆ కొస్త దూరము PWD Road మీద నడిచిందని ఆ రోడ్డు ప్రయాణము అంతా PWD మీదనే నడిచినట్లు ప్రయాణముచేసినట్లు పరిగణిస్తామనడము న్యాయముకాదు నిజానికి యీ అయిదారు మైళ్లు అసలు రోడ్డులో ఏ పదోవంతు ఉంటుంటే, అంతటికి వేస్తామంటే ఎట్లా ? అందువల్ల రూటులో సగానికిమించి ఎ రోడ్డు అయితె ఉ టుందో, దానిమీద వేయండి అంటే రూపాయిలో అర్ధరూపాయికిపైన ఉంటే రూపాయలో చేర్చండి అర్ధరూపాయి కి తక్కువ ఉంటే, తీసివేయండి ఈ విధముగ్గా చేయడము న్యాయమని అంటున్నా

డాక్టర్ బి గోపాలరెడ్డి ఇప్పుడు రూల్సు ప్రకారము PWD Road మీద ఒక మైలు నడవినప్పటికినీ, అది PWD రోడ్డుమీద నడిచినట్లే పరిగణించ బడుతుంది ఒక మైలు కాకుండా అయిదు మైళ్లు అని అంటున్నా.

శ్రీ యమ్ నాగరెడ్డి ఇందాక నేన ఉదాహారణ కూడ ఇచ్చాను సూర్యాపేటనుంచి మిరియాలగూడెం పాయ్యే రోడ్డుమీద వర్షాకాలము లో సంవత్సరములో ఐదు నెలలు మాత్రమే ప్రయాణము సాగుతుంది వర్షాకాలము లో గండ్లు పడుత ఉంటవి ఐదు నెలలు ప్రయాణముచేసి సంపాదించుకున్న డబ్బుతో వాళ్లు ఆ గండ్లు పూడ్చుకుంటూ ప్రయాణము సాగిస్తూ ఉంటారు గండ్లు పూడ్చుకునే ఖర్చు అంతా వాళ్లదే ఆ గండ్లు పూడ్చుకుని సూర్యాపేట నుంచి జిల్లేపల్లిదాకా డొంక రోడ్డున 22 మైళ్లు ప్రయాణముచేయాలి ఈలోగా వాళ్ల బస్సుల కమానులు విరగడము, టైర్లు బ్రద్దలుకావడము, పంచర్లుకావడము సంభవిస్తూ ఉంటాయి. ఇవిఅన్నీ బాగుచేయించుకుని చివరికి ఎట్లాగో 22 మైళ్లువచ్చి మిరియాలగూడెంకు చేరుకుంటారు ఇన్ని ఇబ్బందులతో ఆ బస్సు ప్రయాణము చేయవలసి ఉన్నది వాళ్లకు ఎంత ఖర్చు అవుతూ ఉంటుందో కూడ ఆలోచించండి ఈ ప్రయాణము అంతా డొంకదారినే రావాలి PWD రోడ్డు ఏ అయిదారు మైళ్లో ఉంటుంది ఆ కొస్తదూరము, అందులో 26 మైళ్లు రోడ్డులో సగము అంటే 13 మైళ్లు అయిదు మైళ్లు PWD రోడ్డు సగానికి తక్కువే, ఈ కొద్దిదూరము ప్రయాణము చేసిందని, అంతటికి లెక్కకట్టడము న్యాయముకాదు సగానికి తక్కువేఉన్నది గనుక ఆ అదనపు పన్నును తీసివేయండి ఇదేమాసవరణ ద్వారా కోరేది

శ్రీ ఇ వెంకటరామనరసయ్య (వర్ధన్నపేట) —సంవత్సరములో ఏ అయిదు మాసములో బస్సులు ప్రయాణముచేసినను, సంవత్సరము పొడుగూన ప్రతి నెలకు డ్రైవర్లకు, కండక్టర్లకు జీతాలు యివ్వవలసేయుంటుంది అది మాత్రము తప్పదు మంత్రిగారు ఏదో కొంతవరకు తగ్గిస్తూ ఉన్నారుగనుక, ఆ కొస్తకూడ తీసివేస్తే మంచిదని మనవిచేస్తున్నాను

డాక్టర్ బి గోపాలరెడ్డి బస్సులు నడవని quarter లో పన్ను చెల్లించరే పోగా ! అది rainy season గనుక ఆ quarter లో పన్ను చెల్లించి ఉండరు.

శ్రీ ఇ. వెంకటరామనరసయ్య — Rainy season లో ఏ quarter లో నో పన్ను కట్టక, బస్సు ఆపివేసినను, జీతాలు మాత్రం అన్ని నెలలకు పూర్తిగా ఇవ్వవలసిందే కదా!

డాక్టర్ బి. గోపాలరెడ్డి — బస్సులు నడుపువారు, యీలాంటి ఖర్చులు అన్నీ లెక్క వేసుకోకుండా యీ వ్యాపారాలకు దిగరు.

శ్రీ ఇ. వెంకటరామనరసయ్య — ఆంధ్ర ప్రదేశ్ వస్తుందని, అందులో చేరుతామని అప్పుడు Bus ల మీద టాక్సు ఎక్కువ చేస్తారని బస్సులు కొనుక్కున్నవారు అనుకుని యుండలేరు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు — అయిదు మైళ్ళు అని అంటే, ఇది కేవలము mechanical గా fix చేసినట్లవుతుంది.

*Mr Speaker* I shall now put Sri Nagi Reddi's amendment to the vote of the House

శ్రీ యమ్. నాగిరెడ్డి — అధ్యక్షా, ఉండండి, వందరూ ఓటుకు పెట్టకండి. మంత్రిగారు ఒప్పుకుంటున్నారని అనుకుంటున్నాను. నా సవరణలో మూడు రెట్లను రెండు రెట్లు చేయమని. దీనిని మంత్రిగారు ఒప్పుకుంటే, ఓటుకుపెట్ట నవసరముండదు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి — అసలు R T D బస్సుల విషయము నాగిరెడ్డిగారికెందుకు?

శ్రీ యమ్. నాగిరెడ్డి — Book adjustment యే కదా అని, మంత్రిగారు అంటే పోనీయండి. ఆ Book adjustment మనకే ఉంటుందిగదా! సవరణ ఒప్పుకోటానికి అభ్యంతరము ఏమిటి?

డాక్టర్ బి. గోపాలరెడ్డి — నాగిరెడ్డిగారు అయిదింతలు అని చెబితేగాని ఈ సవరణను నేను ఒప్పుకోవడము లేదు.

*Mr Speaker* The question is.

*Table B*

For the existing column No 2 (Annual Tax) in Table B. substitute of the following —

*Annual tax*

| | | |
|---|---|---|
| Item 1 | . | No change |
| ,, 2 | . | No change |
| ,, 3 (a) | | **Rs 150 plus Rs 24 for every additional person beyond 6 in the case of stage carriages used on the P.W.D. roads.** |

„ 3 (*b*) . Delete completely

„ 4 (*a*) Rs 200 plus Rs 24 for every additional person beyond 8 in the case of stage carriages used on P W D roads

„ 4 (*b*) Delete completely

„ 5 (*a*) Rs 640 plus Rs 24 for every additional person beyond 26 in the case of stage carriages used on P W D roads

„ 5 (*b*) . Delete completely.

„ 6 (*a*) . Rs 800 plus Rs 24 for every additional person beyond 32 in the case of stage carriages used on the P W D roads

„ 6 (*b*) Delete completely

The motion was negatived

*Sri B Sankaraiah* Sir, I beg to move

In Explanation (*b*) under Table B, for the words ' wholly on the P W D Road ' substitute the words " wholly on other road "

For the existing Explanation (*b*) under Table B, substitute the following —

" (*b*) Where a stage carriage is used on a route lying partly on a P W D Road and partly on any other road such stage carriage shall be deemed to be used wholly on the P W D road or any other road whichever is more than half of the length of the route "

*Mr Speaker* Motions moved.

శ్రీ బి శంకరయ్య అధ్యక్షా, R T D buses పి డబ్ల్యు డి రోడ్డు మీద వెళ్ళడానికి Licences యివ్వడం జరుగుతున్నది తక్కిన Private bus owners మట్టి రోడ్లమీదనే పోవడం జరుగుతున్నది కొన్నిచోట్ల వారు P W D. roads ను ఉపయోగించుకుంటున్నారనే కారణంతో వారి దగ్గరనుంచి tax వసూలు చేయాలనేది మొదటి విషయం. P. W. D roads మీద ఏ కొద్దిభాగం వెళ్ళ

నప్పటికినీ అసలు రోడ్డు ఎక్కిందే కనుక PWD Roads మీద వేసే పన్నునే వేసి వసూలుచేయాలని original గా యిచ్చిన డ్రాఫ్ట్‌లో ఉన్నది ఈ సమస్యను సాంగోపాంగంగా పరిశీలించకుండా యీ విధంగా చేస్తున్నాము మనం ఏవిధంగా ఆలోచించినప్పటికినీ అందులో సగం పన్ను అయినా తీసివేయడం న్యాయంగా ఉంటుంది Commercial crops మొదలయిన వాటి విషయంలో కూడా సగానికి ఎక్కువ వుంటే ఎక్కువవేయడం, సగానికి తక్కువ వుంటే తక్కువ వేయడం అనేది మనం ఒప్పుకున్నాము కచ్చారోడ్డు మీద బస్సులను నడిపే Bus owners వాటిపై ఎక్కువ ధనం వెచ్చించవలసివుంటుంది ఈ విషయాలన్నీ ప్రభుత్వానికి తెలియనటువంటివి కావు రోడ్డుల పొడవు సాధారణంగా 50, 60 మైళ్ళు ఉంటూంటాయి అందులో ప్రయివేటు బస్సులవారు 5 లేక 10 మైళ్ళు ఉపయోగించినా చాలా వ్యయప్రయాసలకు, నష్టానికి గురికావలసివుంటుంది అందువల్ల మట్టిరోడ్లనుపయోగించేవారి మీద వేసినట్లుగానే, వీరి మీద కూడా తక్కువ పన్నులే వేయాలి ఈ సవరణను ప్రభుత్వం ఒప్పుకోకపోతే "సగానికి పైన" అనే సవరణనైనా ఒప్పుకోవడం చాలా న్యాయమైనది ఈ విధంగా ఒక్కసారి పన్నులు పెంచడంవల్ల, వచ్చే యిబ్బందులను ప్రభుత్వానికి యిదివరకే తెలియజేశాము ఇప్పుడు ఇతర పన్నుల విషయమేమీ ఎత్తుకోకుండా యీ విధంగా పన్నులు పెంచడంవల్ల మొత్తం ఆదాయం ఎంత పెరుగుతుంది అనే దానికి కూడా సరైన సమాధానం చెప్పడంలేదు రెండు రెట్లు పెరిగినట్లు కనిపిస్తున్నది, కాని అది యింకా పెంచే అవకాశమున్నది ఇదివరకు ఉన్న tax కూ, ఇప్పుడున్న tax కూ చాలా తేడా వస్తున్నది PWD Roads మీద అని tax వేస్తే అది ఒక్క RTD మీదనే కాక private owners మీద కూడా పడుతుంది RTD కూడా యితర taxes అన్నీ చెల్లించాలి ఇక్కడ వుండే RTD ని మద్రాసులో వుండే RTD ని పోల్చిచూస్తే ఇక్కడ తక్కువ ఆదాయం వస్తున్నది కాబట్టి nationalise చేస్తే లాభంలేదని ప్రచారం జరుగుతున్న సమయంలో అదనపు పన్నులువేసి యింక ఆదాయంరాదని చెప్పడం సరైనదికాదు ఎందువల్ల ఆదాయం రావటంలేదో పరిశీలిస్తున్నామన్నారు ఎక్కువ ఆదాయం రావడానికి ప్రయత్నిస్తున్నామన్నారు ఇతర పన్నుల విషయం కూడా త్వరలోనే పరిశీలిస్తున్నామన్నారు ఇటువంటివన్నీ వేయడం పూర్తి కాకుండానే త్వరపడి taxes వేసినట్లయితే తక్కువ ఆదాయము వస్తుందని ప్రచారంచేసేవారు, nationalisation కు వ్యతిరేకంగా వున్నవారు, బాగా డబ్బు సంపాదించాలనీ, ప్రయివేటు బస్సులను కొనాలనీ చూస్తున్నారు పెద్దపెద్దవారంతా యీ అవకాశాన్ని తాము ఉపయోగించుకోవాలని చూస్తున్నారు అక్కడ మాదిరిగా యిక్కడ వ్యాపారాలుగాని, లారీలు, బస్సులుగాని అభివృద్ధి కాలేదనే విషయంమనకు తెలుసు అక్కడ ప్రయాణీకులమీద 7 పైసలువేసి, వసూలుచేసి లాభాలుతీసే పరిస్థితిలో యిక్కడ 11 పైసలువేసిన పరిస్థితులున్నాయి ఇది ప్రజలమీద పడదని చెప్పడానికి అవకాశంలేదు. బస్సువారిమీద ఒకేసారి యింత పన్ను జాస్తీచేస్తే వారు ప్రయాణీకులరేటు పెంచుతారు అట్లా ప్రయాణీకుల నుంచి ఎక్కువ వసూలుచేయరు అనే హామీ ఏమీలేదు చట్టంలో ఆ provision లేదు దానిపై ప్రయాణీకులు రేట్లు ఎక్కువ అయినాయని ఆందోళన చేస్తారు. Nationalisation ను వ్యతిరేకించేవారు యిది ప్రభుత్వానికే నష్టమని గోలచేస్తారు. ఆవిధంగా ప్రభుత్వం అమలుచేస్తున్న పంచవర్ష ప్రణాళిక అంతా

